# వైకుంఠం

(కవ్వించి నవ్వించే నాటకం)



పి. రాఘవ్‌రావ్



సౌభాగ్య పబ్లికేషన్సు
శ్రీరామనగరం
కాకినాడ

## అమ్మా !!!

అమ్మా! అమ్మా!!

ఆ లోకంలో నీవు

ఈ లోకంలో నేను

నిన్ను చూడలేని కళ్ళతో

నీ మాటలు వినలేని చెవులతో

అయినా నిన్ను మరువలేనమ్మా!

నీ వాత్సల్యం మరపురానిదమ్మా!

ఇదిగో! ఇదే నా రచన "వైకుంఠం"

మరపురాని నీ ప్రేమకు మూల్యం

నీ జ్ఞాపకార్థం నిల్చే చిహ్నం

అందుకో నా అంకితం!!!



పాత్రకు ప్రాణం పోసిన నటుడు



# వైకుంఠం

శ్రీ పి. సీతాపతిరావు, B. A.

తొలి ప్రదర్శనం

**26-1-1957**

ప్రదర్శకులు :

విజయశ్రీ ఆర్ట్సు థియేటర్సు, కాకినాడ.

నాటి నటీనటవర్గం

1. శైకుంఠం : శ్రీ పి. సీతాపతిరావు
2. శరభయ్య : శ్రీ పి. రాఘవన్ రావ్
3. పద్మనాభం : శ్రీ హెచ్. వి. రమణమూర్తి
4. శ్రీశైలం : శ్రీ జి. టి. ఆచార్య
5. మురళి : శ్రీ జి. భానుమూర్తి
6. నరహరి : శ్రీ యన్. సూర్యనారాయణ
7. పశుపతి : శ్రీ వి. యన్. రామారావు
8. కొండయ్య : శ్రీ యమ్. నరశింహారావు
9. రాధ : కుమారి రమణి

ఈ నాటకం 1957 లో గొల్లప్రోలులో జరిగిన నాటకపోటీలలో ప్రథమ బహుమానం పొందింది.

## ఇందులో



# వైకుంఠం

## మొదటి రంగం

[శరభయ్య ఇంటిలో హాలు. గోడలకు ఫొటోలు అలంకరించబడి ఉంటాయి. పార్వతీపరమేశ్వరుల ఫొటో హాలులో అడుగుపెట్టగానే ఎదురుగా కనిపిస్తూ ఉంటుంది. శరభయ్య "భార్య" ఫొటో మరో గోడ కమర్చబడి వుంటుంది. ఒక పడకకుర్చీ, రెండు మూడు మామూలు కుర్చీలు, ఒక స్టూలు, మరొక ప్రక్కగా చిన్న టేబిలు, కొన్ని పుస్తకాలు.]

శర :- (వీధిలోనుండి వస్తున్నాడు. చేతిలో సంచీ ఉంటుంది. అందులో కొన్ని పళ్లు, హార్లిక్సుసీసా ఉంటాయి. వస్తూనే) కొండయ్యా! కొండయ్యా!! కొండయ్యా!!!

కొండ:-(అదేస్థాయిలో లోనుంచి) అయ్యా! వస్తున్నానయ్యా!

శర :- (కుర్చీలో కూర్చుంటాడు. కొండయ్య వచ్చేడు. చేతిలో కల్వం రాయి ఉంటుంది) ఏమిటిరా ఆ అవతారం? చేతిలో రాయి, చెవిలో చుట్ట, మొఖానికా రంగు, ఏం చేస్తున్నావు లోపల?

కొండ:- ఆచార్యులు డాక్టరుగారిచ్చినమందు నూరుతున్నానయ్యా! వెన్నపూసలా నూరేసేను. పట్టువేయడమే తరువాయి.

శర :- పళ్లు, కట్లు ఏమీ వద్దు. ఆమందులన్నీ అవతల పారెయ్యి
ఇదిగో ఇక్కడనుంచి ఈమందివ్వా లమ్మాయికి.

కొండ:-(మందుసీసా తీసుకుని) మంచు మా రిం దే అయ్యా!
ఆచార్యుల డాక్టరుగారి మందు ఆపేసే నట్టయ్యా!

శర :- మొదలెట్టేవు అడ్డుప్రశ్నలు. ఛో! ఇప్పుడో మోతాదు
యియ్యి. (కొండయ్య పోతూంటాడు)

శర :- ఒరేయ్! మాట మాట! ఇదిగో పళ్లు, హార్లిక్సు (సంచీ
అందిస్తూ) అరగంట పోయాక పళ్లరసం, మరోగంటకు
హార్లిక్సు కలిపి యియ్యి.

కొండ:-ఓల్ రైటుగా! (పోబోయి వచ్చి) ఏమంటారు? పళ్ల
రసంలో హార్లిక్సు కలపాలా!

శర :- అదికాదురా! పళ్లరసం ముందు. తరువాత హార్లిక్సు.
ఆమాత్రం తెలియదురా!

కొండ :- ఓల్ రైట్. తెలిసింది, తెలిసింది. వెంటనే ఈ మందు
యివ్వాలి. ఆ వెనుక పళ్లరసం, ఆ వెనుక హార్లిక్సు.
మందు, పళ్లరసం, హార్లిక్సు. (అనుకుంటూ పోతూం
టాడు)

శర :- ఒరేయ్! మాట మాట.

కొండ :- మళ్లీ బ్రేకు! (వస్తూ) ఏందయ్యా!

శర :- అమ్మాయి ఏమి చేస్తోంది!

కొండ :- అలా దిగాలుగా తొంగున్నారయ్యా.

శర :- పడుకుందా! కాఫీ పుచ్చుకుందా!

కొండ :- బ్రతిమిలాడగ బ్రతిమిలాడగ గుక్కెడు కాఫీనీళ్లు గుటుక్కున మింగేరు అంతే.

శర :- (నిట్టూర్చి) అమ్మాయి కేదిగు లెందుకో... నువ్వేమైనా తెలుసుకున్నావా!

కొండ :- నోరిప్పి చెప్తేగా తెలుసుకోడానికి! మనస్సులో మర్మం మనకెట్టా తెలుస్తుందయ్యా! ఎప్పుడూ గుడ్లప్పగించి ఎటో ఆలోచిస్తూ ఉంటారు. ఉన్నట్టుండి ఒక్కసారి లేస్తారు. అలా అటూ యిటూ తిరుగుతారు. మళ్లీ అలాగే చతికిలబడి పోతారు. అంతలోకే ఎక్కి ఎక్కి ఏడ్చేస్తారు. (కొండయ్య ఇదంతా action లో చెప్తూ వుంటే శరభయ్య 'Feel' అవుతూ వింటూంటాడు) కుంచేపటి కల్లా కళ్లు మూసుకుని అలాగే పడుకుంటారు. (కుర్చీకి జార్లపడి పడుకుంటాడు శరభయ్య. చూస్తూ నిలబడుతాడు) ఏరా! ఫూల్! బుద్ధిలేదూ! ఏంటలా చూస్తున్నావ్! ఛో! అంటారయ్యా! (అంటూ అమాంతంగా అగ్గిబరాటాలా లేస్తాడు. శరభయ్య ఉలిక్కిపడతాడు.) కాదమ్మా! కోప్పడకండమ్మా! కొంచెం కాఫీ తాగండమ్మా! అని బ్రతిమాలితే "మీరంతా

నన్ను చంద్రబాలని చూస్తున్నారు. నేనే గొంతు పిసు
క్కుని చస్తా! కని విరగబడి పోతుంది. చస్తా!" (గొంతు
పిసుక్కోబోతాడు)

శర :- (Feel అయి) అరెరె! అంతపనే! ఆగు! ఆగు!

కొండ :- అని నేనంటే- "ఛీ! వెధవా! ఫో!" అంటారయ్యా.

శర :- (బాధపడుతూ కుర్చీలో కూర్చొని) ఏం ప్రారబ్ధం వచ్చి
పడిందిరా! ఒక్కగాని ఒక్క కూతురు. కాలు కదిపితే
కందిపోతుందేమోనని కళ్ళల్లో పెట్టుకుని పెంచుకొస్తున్నా.
అడగడమే తరవాయిగా అన్నీ అమరుస్తున్నా! ఈ దిగు
లేమిటి! ఈ రోగ మేమిటి!

కొండ :- నా మాలాచార్యులు చెప్పేరు కదయ్యా! నరాలబలహీన
తని.

శర :- వాడిముఖం-పదో నోటికొచ్చింది చెప్పేడు. గచ్చాకు
పుచ్చాకు నూరి గొంతుకలో పోయించాడు. పదిహేను
రోజులపాటు దాని ప్రాణం మన ప్రాణం తీసేడు. కొంచె
మైనా గుణం కనిపిస్తేగా!

(లో నుండి కొండయ్యా! కొండయ్యా!)

శర :- అదిగో! అమ్మాయి పిలుస్తోంది. పో! ముందియ్యి

కొండ :- అమ్మా! (లోనికి పోతాడు)

శర :- (భార్య ఫోటో దగ్గర చేరి) చూశావా! ఎన్ని కష్టాలు పడుతున్నానో నీ కూతురితో! మంచి మందు లిప్పిస్తున్నాను. ఏమీ గుణం కనిపించడం లేదు. మరేం చెయ్యమంటావు చెప్పు (కోపం ఊపిరాకేం తోచడం లేదు... నాకే మందు వద్దు. అవతల పారెయ్యి ఆమందు. పో, వెళ్లిపో)

(శరభయ్య ఫోటోకి వైపు చూస్తూ ఉంటాడు)

(బయటనుండి మాస్టారుగారూ! మాస్టారుగారూ అంటూ "వైకుంఠం" చరచరా లోనికి వస్తాడు. వెంట శ్రీశైలం ఉంటాడు. శరభయ్య నిశ్శబ్దంగా లోనికి చూస్తూండటం గమనించి "వైకుంఠం" గుమ్మం దగ్గరే నిలబడతాడు.)

శర :- (వారిరాక గమనించి) వైకుంఠం! రామానుజ! సమయానికే వచ్చావు. సలహా చెప్పే వాళ్లెవరూ కనిపించక చస్తున్నాను.

వైకుం :- నా సలహాయే కావాలి! రామానుజ! ఏమిటీ విశేషం?
(అంటూ కూర్చుంటాడు.)

శ్రీశై :- (కూర్చుంటూ) అమ్మాయి ఒంట్లో బాగులేదని విన్నాం.

శర :- అవును, అదే నా ప్రాణం తీస్తోంది. ఏమీ తినడం లేదు. కాఫీనీళ్లైనా పుచ్చుకోవడం లేదు. ఏమీ వద్దంటుంది. ఏమన్నా అంటే మండిపడుతూంది. ఏమిటో! రోజు రోజుకు నీరసించి పోతోంది.

వైకుం :- అబ్బా! అంత సీరియస్‌గా ఉండేం?

[లోనుండి పళ్లావద్దు, పాలూవద్దు. చెప్పుంటే సీకాద్దూ]

శర :- అదిగో; అదీవరస. (వైకుంఠం లోపల గుమ్మంవైపు చూస్తుంటాడు)

[లోనుండి "నా దగ్గర కేమీ రావద్దు. నన్ను పలుకరించ వద్దు పొండి. పొండి" అంటూ బత్తాయి పండు విసరగా వైకుంఠానికి తగులుతుంది.]

వైకుం :- (క్రిందపడిన పండు తీస్తూ) బాగానే ఉంది వరస. (కూర్చుంటాడు)

శ్రీశై :- డాక్టరేమంటాడు?

శర :- పైత్యవికార మన్నాడు పెరుమాళ్లయ్యా. కాదు గుండె జబ్బన్నాడు గోవిందరావు. అదికాదు నరాల బలహీన తంటాడు సామాలాచారి. అవేవీ కావు అజీర్ణ రోగ మంటున్నాడు అచ్యుతం.

శ్రీశై :- అవేం కాదయ్యా! అనుమానంలేదు. ఇది గ్రహ దోషమే! నవగ్రహ శాంతి చేయిస్తే నాల్గురోజుల కల్లా నయమయిపోతుంది. నమ్ము నామాట..

వైకుం :- తగ్గవయ్యా! రోగం కాదు, గ్రహదోషం కాదు. చెప్పలేని బాధ...

శర :- అంటే?

వైకుం :- అంటే! కోరని కోరిక ఉంటే!

శర :- కోరికలా! ఏమున్నాయి? అడగకుండానే అన్నీ అమరుస్తుంటే.

వైకుం :- అయినా ఆడపిల్లల మనసు తెలుసుకోవడం కష్టం. మనస్సు విప్పి చెప్పరు. మనసు మార్చుకోరు. లోలోపలే బాధపడుతూంటారు.

శర :- తండ్రి దగ్గరే దాపరికమైతే ఎలా చచ్చేది? ఏ విషయమైనా కాదంటేగా!

వైకుం :- అన్నావుపుటగా ఆమాట! అయినా అక్కరలేని గొడవలన్నీ నాకెందుకు! రామానుజ!

శర :- ఏమన్నాను?

వైకుం :- ఏమంటే నాకెందుకు? అడగకూడదనుకునే అడిగేసాను.

శ్రీశై :- చెప్పేదేదో సరిగా చెప్పకూడదూ?

వైకుం :- చెప్తే కోపం రాదూ?

శర :- విన్న విషయం చెప్పడానికి నీకేం భయం?

వైకుం :- మేనత్తకొడుకిచ్చి పెళ్ళిచేయాలని....

శర :- అన్నాను.

వైకుం :- అదే నేను విన్నాను.

వైకుంఠం

శర :- ఆ! అయితే

వైకుం :- ఏముంది! ఆరోజే మొదలయి ఉంటుంది అమ్మాయికి జబ్బు. క్లియరు కేసు. 'లవ్ ఫెయిల్యూర్'. ఇక డాక్టర్లెందుకు? మందు లెందుకు? మాన్పించెయ్యి.... అయినా అక్కరలేని గొడవలన్నీ నాకెందుకు. వద్దు. వద్దు. నా సలహా వినవద్దు.

శ్రీశై :- వినమంటే వింటారా సచ్చుకపోతే?

శర :- అవును, పిల్లలు నిచ్చుకొని చిక్కులు కోరి తెచ్చుకున్నాం. ఇప్పుడు కూతురునిచ్చి కొంపపెట్టి తల గోక్కుంటామా?

శ్రీశై :- అదేంమాట? పరాయివాడా! బావమరిది.

శర :- బావమరిదే కాని, బ్రహ్మదేవుడే కాని మాటపట్టింపు వచ్చాక మరి వాడి సంగతి ఎత్తకూడదు. ముఖం చూడకూడదు. వాడి గుమ్మం ఎక్కకూడదు.

వైకుం :- అంతే! అంతే! మనసు విరిగిందంటే మరి అతుక్కోవడం కష్టం. వారికి వీరికి ఏవో పట్టింపులు వచ్చాయి. చెల్లెలి మొగుడు కదా అని ఈయన సరిపెట్టుకోలేదు. పెళ్ళాం అన్న కదా అని ఆయన సర్దుకోలేదు. ఇప్పుడు పిల్లనిస్తానని ఈయన ఎలా అనగలడు? చేసుకుంటానని ఆయనెలా వప్పుకోగలడు?

శర :- వప్పుకుంటే మట్టుకు ఇచ్చేవాడెవడు ?

వైకుం :- అయితే వెంటనే మరో సంబంధం సెటిల్ చేసెయ్యి.
శ్రీశైలం! అంతేనా !

శ్రీశై :- అంతే మరి.

శర :- అదే నేనూ ఆలోచిస్తున్నా !

వైకుం :- ఆలోచనెందుకు. పెళ్ళి కొడుకేడీ అనా ? పెళ్లికే
మంత తొందరా అనా? (పాజ్ ఇచ్చి) ఇదిగో! ఈ జబ్బుకి
మందు పెళ్లే! పెళ్లి ఆలస్యమయితే ప్రేమ పిచ్చిగా
మారుతుంది. పిచ్చి ముదిరితే మనమే నుయ్యో గొయ్యో
చూసుకోక తప్పదు.

శర :- అలాగే చేద్దామనుకో. సంబంధం రెడీగా దొరకద్దూ ?

వైకుం :- ఏ లాంటివాడు కావాలి ? ఆస్తి ఉన్నవాడా ? అంద
మైనవాడా ? ఆనర్సు డిగ్రీ ఉన్నవాడా ?

శర :- అన్నీ ఉంటేనే అందం.

వైకుం:- శ్రీశైలం! చెప్పేస్తా. అంతా "సెభాష్" అనే మార్గం
చెప్పేస్తా!

శ్రీశై :- వద్దు వద్దు. ఆయనతో మనం సరితూగ గలమా ?

వైకుం:- ఏం ఎందుకు తూగలేం? ఏం తక్కువని మీవాడు
శరభయ్య అల్లుడు కాకూడదు ?

శ్రీశై :- ఆవిషయం నిర్ణయించేది పిల్ల నిచ్చేవాళ్లు.

శర :- (శ్రీశైలంతో) మీవాడికేదో సంబంధం "సెటిల్" అయిందనుకున్నారు కదూ ?

శ్రీశై :- అనుకోవడానికేం ? నేనిష్టపడొద్దూ ?

వైకుం:- ఇష్టపడితే యీపాటికే అయిఉండేది పెళ్లి. శరభయ్యా! పిల్లకు కొంచెం కన్ను మెల్ల, కాలు సొట్ట. అందుకే వేసాడు బ్రేకు.

శర :- మరి మా సంబంధ మయితే.

వైకుం:- మహారాజులా ఒప్పుకుంటాడు.

శ్రీశై :- ఆ మాట లిప్పుడెందుకు ?

వైకుం:- అదేమిటి ? పిల్ల నిస్తానని పెద్దమనిషి అడుగుతూంటే!

శ్రీశై :- కాదన లేదుగా !

వైకుం: సరే! ఇక మాట్లాడకు మిగతా విషయాలన్నీ నే సెటిల్ చేస్తా (శరభయ్యతో) మంచి రోజు నిర్ణయించండి. తాంబూలాలు పుచ్చుకో వచ్చు.

శర :- పెళ్లికొడు కేమంటాడో !

శ్రీశై :- నామాటే వాడి మాట (వైకుంఠంతో) కాని ఆడవాళ్లడుగుతారు- కట్నాలు కానుకలు ఏం తేల్చారూ అని.

శర :- సీకా డవుట్ ఎందుకు ? ఇతరు లిస్తానన్న దానికన్న ఓ వెయ్యి రూపాయ లెక్కువిస్తాను. లాంఛనాలు లోటు చెయ్యను. ఇంకేం కావాలి ?

శ్రీశై :- నాకు కావాలా ? ఇవైనా ఆడవాళ్లకు సంబంధించినవి కనుక అడగక తప్పలేదు. మరోలా అనుకోకు సుమా!

వైకుం:- ఎందు కనుకుంటాడు ? అడగవలసిన వాడివి నువ్వు, ఇవ్వవలసిన వాడాయన. ఎప్పటికయినా ఇదంతా అమ్మాయిదేగా !

శ్రీశై :- బాగుంది. ఎప్పటి మాటప్పుడే.

కుం :- ఇక మాట్లాడకు. మీ మర్యాదల కేమీ లోటు రాకుండానే జరిపిస్తాం. (శరభయ్యతో) సిద్ధాంతిని పిలిపించండి.

[రాధ : "ఒక్క క్షణం కూడా ఈ ఇంట్లో ఉండలేను. అంతా యములాళ్లు కూడారు. నన్ను పోనియ్యి. అడ్డులే" అంటూ, కొండయ్యను తోసుకొని హాలులోకి వస్తుంది. వైకుంఠం, శ్రీశైలం గుడ్లప్పగించి చూస్తూ ఉంటారు.)

శర :- (అడ్డుకొని) అమ్మా! ఏమిటమ్మా ఇది! నా బంగారు తల్లివికదూ. ఎవ్వరూ నీ జోలికిరారు. ఏమీ అనరులే. రాఅమ్మా! రా! కూర్చో. (కూర్చోపెడుతూ) కొండయ్యా! లోపలికి పో! (కూడా వచ్చిన కొండయ్య వెళ్లి పోతాడు) వైకుంఠం...

వైకుం :- ఆ వస్తాం. మళ్లీ వస్తాం. రావయ్యా! రామానుజా !

(శ్రీశైలం, వైకుంఠం వెళ్లిపోతారు)

[రాధ నీరసంగా కుర్చీలో జార్లబడి ఉంటుంది]

శర :- (దగ్గరగా చేరి) అమ్మా! మంచినీళ్లిమ్మంటావా?

రాధ :- ఉహుఁ! (విసుగ్గా అంటుంది.)

శర :- పోనీ...హార్లిక్సు.

రాధ :- అబ్బా! వద్దు.

శర :- ఎందుకమ్మా అంత విసుగు. చూడు. ఎన్నాళ్లిలా ఉప వాసాలు చేస్తావు? ఎందుకని చేస్తావు? నా దగ్గరే దాపరి కమా? ఏం కావాలో చెప్పు? చీరలా? నగలా?

రాధ :- (మాట్లాడదు)

శర :- కాలేజీ చదువు కావాలా?

రాధ :- ఉహుఁ!

శర :- సంగీతం నేర్చుకుంటావా?

రాధ :- (కాదని తల త్రిప్పుతుంది)

శర :- ప్యాన్సు నేర్చుకుంటావా?

రాధ :- ఏమీ వద్దు. నన్నిలా బ్రతకనివ్వండి.

శర :- (బరువుగా) ఎంతమాటన్నావమ్మా? నీవే లేకపోతే నాకీ ప్రపంచమే లేదు. నేను బ్రతికేదే నీకోసం. అది నీకు నాల్గో సంవత్సరం. అమ్మకు హఠాత్తుగా జబ్బు చేసింది. ప్రాణం మీదికి వచ్చింది. ఆఖరు క్షణంలో ఆ పోయే ప్రాణానికి హామీ ఇచ్చాను. (ఫ్లాష్) ఏలో టూ

కాకుండా నిన్ను పెంచుతానన్నాను. అది నిశ్చింతగా కళ్లుమూసింది. నీ భారం నా మీద పడింది. ఆ రోజుతోనే నా సౌఖ్యానికి నీళ్లొదులు కున్నాను. ఎన్నో శ్రమలు పడి నిన్నింత వరకూ పెంచాను. కూతురువైనా, కొడుకు వైనా, నీవేనని తృప్తి పడ్డాను. (పాజ్) నీ సౌఖ్యం కోసం ఏం చెయ్యమన్నా చేస్తానమ్మా. చేస్తాను. ఒక్కటి తప్ప (కళ్లనీళ్లు పెడతాడు)

రాధ :- మీరు బాధపడొద్దు. బెంగపెట్టుకోవద్దు. డబ్బు ఖర్చు చెయ్యొద్దు. నాకేం జబ్బులేదు. మందులు, మాకులు ఏమివద్దు. ఉంటే ఉంటాను. తింటే తింటాను. చస్తే చస్తాను. నన్నిలా వొదిలెయ్యండి.

(శరభయ్య ఆశ్చర్యంగా చూస్తుంటాడు)

రాధ :- తెల్లబోతారేం. నిజం చెప్తున్నాను. ఇవి పరాకు మాటలు కావు. పిచ్చిమాటలు కావు. (కొంచెం ఆగి) బావనే పెళ్లి చేసుకోవాలని అనుకున్నాను. మా పెళ్లికి మీరొప్పుకోరు. నాకీఏడుపు తప్పదు. ఏడుపుతోనే చచ్చిపోతాను. నన్ను చావనివ్వండి. (ఏడుస్తూ లోనికి పోతుంది)

శర :- అబ్బో! చాలవరకు వచ్చిందే వ్యవహారం? వాళ్లు వీళ్లు చెప్తే ఏమో అనుకున్నాను. అదే నిజమన్నమాట. ఈ ఉపవాసాలు మూగ నోములు అందుకా? సరే! దీనికి మందు నాకు తెలుసు,కొండయ్యా !

కొండ :- అయ్యా ! (వస్తాడు)

శర :- సిద్ధాంతిగారిని అర్జంటుగా తీసుకురా !

కొండ :- ఎందుకయ్యా!

శర :- అడిగేవు! అడ్డుప్రశ్న. శకునపక్షీ! వెళ్లు.

కొండ :- అయ్యా (తిరిగి వచ్చి) ఏ సిద్ధాంతిగారయ్యా !

శర :- చంపేస్తున్నావురా? మన కుందనాల సిద్ధాంతిరా (ఆలోచిస్తూ నిలబడతాడు) ఆంజనేయులుగారడితి(ప్రక్క యిల్లు.

కొండ :- ఓల్‌రైటు. తెలిసిందయ్యా (వెళ్లి తిరిగి వచ్చి) ఆయనింట్లో లేకపోతేనయ్యా !

శర :- (విసుగ్గా) నువ్వో కారు క్రిందోపడి చస్తేనయ్యా? శకున పక్షీ పో! పో! నేనే వెడతానులే (చరచర బయటకు పోతూంటాడు)

కొండ :- (ఎదురొచ్చి) అయ్యా!

శర :- పో! పో! (వెళ్లిపోతాడు)

కొండ :- హూ !! మాటవినిపించుకునే మనిషి కాదుగా ! ఎంత అనుకుంటే అంతే. అయ్యాకన్న నాలుగాకు లెక్కువ చదివిందీఅమ్మాయిగోరు. మాట నెగ్గక పోతే మాడి చత్తానని కూచుంది. మరి ఆ వచ్చే అల్లు డెలాంటి వాడొస్తాడో! ఏమకొండలవాడా! వెంకటరమణా! ఏం చేస్తావో ! (వెళ్లిపోతాడు)

— తెర —

# రెండవ రంగం

[శరభయ్య ఇంట్లో— పడకకుర్చీలో "రాధ" దిగులుగా పడు కుని ఉంది. కొండయ్య పళ్లరసం తీస్తూ ఉంటాడు]

కొండ :- అమ్మాయిగారూ!

రాధ :- (మాట్లాడదు)

కొండ :- అమ్మాయిగారూ!

రాధ :- (మెల్లగా) ఆ!

కొండ :- కొంచెం పళ్ళరసం తీసుకోండమ్మా!

రాధ :- వద్దు.

కొండ:- (లాలనగా) నామాటవినండమ్మా! కూంత తాగండమ్మా (పాజ్) తోటకూరకాడలాగ ఎలా వాడిపోయారో! లే! అమ్మా లే!

రాధ:- అబ్బ! వద్దంటే (విసుగుకుంటుంది)

కొండ :- అలా అనకమ్మా! కాబోయే పెళ్లికూతురివి.

రాధ :- (విసుగ్గా) పెళ్లి! పెళ్లి! ఆ మాట వింటుంటే నా తల తిరిగిపోతోంది. గుండెల్లో గాబరాగా ఉంటోంది. ఒళ్లంతా వొణికి పోతూంది. కొండయ్యా! నీకు పుణ్యం ఉంటుంది. ఆ మాట చెవిని పడకుండా సాయం చేయలేవు.

కొండ :- ఎర్రిబాగుల తల్లీ! ఎందుకమ్మ అంతగాబరా! చదువు కున్నోళ్లు మీరే దిగాలుపడితే ఎట్టా? చిక్కులొచ్చిన ప్పుడే చిరాకుపడకుండా ధీమాగా ఉండాలి!

రాధ :- చెప్పేవులే నీతులు. చాలు చాలు.

కొండ :- అటా కొట్టెయ్యకమ్మా (పాజ్) మీ మనసు నాకు తెలుసు. చెప్పేసా! ము ర ళీ బా బు తో సంగతంతా చెప్పేసా.

రాధ :- (ఆశగా) కొండయ్యా!

కొండ :- అవునమ్మా! మీరిట్టా బాధపడుతుంటే నేచూడగలనా?

రాధ :- బావ ఏమన్నాడు?

కొండ :- వొస్తానన్నాడు.

రాధ :- నిజంగానే?

కొండ :- ఓల్ రైటుగా! ఇయ్యాల్లో, రేపో వచ్చేత్తాడమ్మా (సంతోషంగా చెప్తాడు)

రాధ :- అమ్మో! ఇక్కడికే! నాన్న కీసంగతి తెలిస్తే నిన్ను, నన్ను చంపెయ్యడూ? నా మూలాన నీవు కూడా చిక్కుల్లో పడొద్దు కొండయ్యా.

కొండ :- వొతి పిరికిమాట చెప్పేవమ్మా, ఛా! కోరిక తీరాలంటే గుండెనిబ్బరం కావాలి. ఎత్తుకు పై యెత్తు వేయాలి.

రాధ :- ఏమైనా నాన్న మనస్సు మార్చడం కష్టం. చూశావా! మనస్సు విప్పి చెప్పినా మాట వినకుండా ముహూర్తం పెట్టేస్తున్నారు! నోరు లేని పశువులా బానమియ్యబోతున్నారు. మెడకు ఉరిత్రాడు ముడివెయ్యబోతున్నారు.....కొండయ్యా! నువ్వేచెప్పు బావను మరచి

పోమ్మంటావా ! ఆశల్ని చంపుకొని అంధకారంలో బ్రతకమంటావా (కళ్ళనీళ్లు పెడుతుంది.)

కొండ :- బెంగపెట్టుకోకమ్మా. మురళీ బాబొచ్చాడంటే యవ్వారమంతా రైటయిపోతుంది. "ఏంటి మామయ్యా ఏంటీ అన్యాయం ? పిల్ల నిత్తావా ? ఇవ్వవా!" అని ముక్కుమీద గుద్ది అడిగేస్తాడు. "సరే కానియ్యి అల్లుడా! మనకెందు కీపేచీ" అని బాబొప్పుకుంటాడు. అంతే.

రాధ :- బావను కలుసుకోగల నంటావా !

కొండ :- కలుసుకోవడం కాదు. కల్యాణం చేసుకుంటావమ్మా! ["పెళ్లి! ఆహాహా పెళ్లి! ఓహోహొహో పెళ్ళీ! ఈలోకమందు సౌఖ్యాలనందగా పెళ్ళీ" అంటూ పాడుతూ తమాషాగా రాధను నవ్వించాలని డాన్సు చేస్తాడు. రాధ విరగబడి నవ్వుతూ ఉంటుంది. ఆ మూడ్‌లో కొండయ్య రాధకు పళ్లరసం ఇస్తాడు. రాధ మాట్లాడకుండా త్రాగేస్తుంది. కొండయ్య రాధను నవ్విస్తూనే ఉంటాడు.]

[బయటనుండి పంజాబీ పామిస్టు వేషంలో మురళి వస్తాడు.]

మురళి :- (వస్తూనే) హల్లో! గుడ్‌మార్నింగు! మాష్టర్‌జీ! గుడ్ మార్నింగు.

రాధ :- ఎవరది ? (కొండయ్య నిలబడి చూస్తుంటాడు)

ముర :- జై! భోలానాథ్! సాముద్రులం! దేవీ ఉపాసకులం! ఉత్తరదేశంనుండి వస్తున్నాం! ఉన్నది ఉన్నట్లు చెప్తాం. ఏదీ! ఒక పువ్వు పేరు చెప్పుకో! శ్రీమతీ! (ముందుకు వస్తూంటాడు)

కొండ :- (అడ్డు నిల్చి) ఏంటా జబరదస్తీ! ఆడోళ్లున్నారు! ఆగు!

ముర :- కోపం వద్దు మాష్టర్జీ, కొంచెం నిదానించు! జై భోలానాథ్!

రాధ :- నువ్వూరుకో కొండయ్యా (లేచి సాముద్రుడివైపు చూస్తూ) మీరు సాముద్రికం కరక్టుగా చెప్పగలరా?

ముర :- హాఁ! హాఁ! మాది ఫోరణాస్ (Four annas) సాముద్రికం కాదు. బడాబడా రాజా సాహేబులు, రాణీ సాహేబాలు, మినిస్టర్లు, గవర్నరులు, కలక్టర్లు మమ్మల్ని మెచ్చేరు. చేసేరు జోహార్లు. చేయి చూసి చెప్తాం. చూడకుండా చెప్తాం. ఉన్నది ఉన్నట్లు చెప్తాం. లేనిది లేనట్లు చెప్తాం. మాట నమ్మ! మచ్చ చూడు శ్రీమతీ! (వచ్చి కూర్చుంటాడు)

కొండ :- (మురళీ ఆఖరు మాటలు ధోరణిలోనే) మర్యాదగా లే శ్రీమతీ! (చెయ్యి పట్టుకొని లేవదీయబోతాడు)

ముర :- జై! భోలానాథ్! అధిక ప్రసంగం.

కొండ :- అవును గురూ! అదే వద్దు! వెళ్లిరా. లేకపోతే నీపు సాపయిపోగలదు...బొబ్బాచ్చాబడంటే.

రాధ :- తొందరపడకు కొండయ్యా. చెప్పేదేదో చెప్పనియ్యి.

మురా :- జై భోలానాధ్ ! నిజం పలికావు. నీకు జయం కలుగు
తుంది. ఏదీ పువ్వు పేరు చెప్పుకో శ్రీమతీ!

కొండ :- కొయ్యి గురూ! కోతలు కొట్టు. (ప్రక్కన కూర్చుం
టాడు.)

రాధ :- పువ్వు పేరు చెప్పాలా !

మురా :- నై ! నై! మనస్సులో తల్చుకో.

రాధ :- ఆ!- సరే ! తల్చుకున్నాను.

మురా :- ఒక అంకె.

రాధ :- ఆ ! అదీను.

మురా :- తలచుకున్నావా ?

రాధ :- ఆ !

మురా :- జై భోలానాధ్ ! చెప్తాం విను. (పెద్దపోజు యిచ్చిలెక్క
పెట్టి) జై భోలానాధ్ ! తలచింది గులాబీపువ్వు ! అంకె
ఆరు.

రాధ :- (వేళకోళంగా నవ్వుతూ) బలే సామిప్టరీ ! బాగా
చెప్పేరు. అంతా తప్పే (నవ్వుతూంటూంది)

కొండ :- తప్పేవా గురూ! (విరగబడి నవ్వుతూంటాడు)

మురా :- (సీరియస్‌గా) హాస్యం చేస్తున్నావు. జై భోలానాధ్.

రాధ :- హాస్యం కాదు. అనుకున్నది మల్లెపువ్వు-అంకె నాలుగు.

కొండ :- గురూ! ఇయ్యాళ ప్రొద్దున్నే లేచి ఎవడి మొఖం చూచేవ్.

ముర :- జై బోలానాధ్! (కోపంగా చూస్తాడు)

కొండ :- కోప్పడకు గురూ! లేచినేళ బాగా లేదు. లెఖ్ఖ గురి తప్పింది. మరెందుకీ శ్రమ? తిన్నగా స్టేషను కెళ్లిపో.

ముర :- జై బోలానాధ్!

కొండ :- పోలీసుస్టేషనుకి కాదు! రైలుస్టేషనుకి- వొచ్చేపోయే ప్యాసంజర్ల సట్టుకున్నావంటే సాపాటుకి లోటుండదు. అయిడియా బాగుందా గురూ!

ముర :- తగ్గు మాష్టర్జీ! లెఖ్ఖ తప్పినా రేఖ తప్పదు. ఏదీ చెయ్యి శ్రీమతీ.

రాధ :- చాలు మీ పామిష్టరీ! అంతాఅబద్ధమే! వెళ్లండి!

ముర :- నమ్మకం లేదా శ్రీమతీ! సరే! చెయ్యి చూడకుండా చెప్తున్నాం. జై బోలానాధ్! (లెక్కపెట్టి ఆకాశం వైపు చూస్తూ) గురువులో శుక్రుడు- శుక్రుడులో శని- శనిలో రాహువు — రాహువులో కేతువు.

కొండ :- కేతువులో నువ్వు... నువ్వులో నేను.

ముర :- గ్రహస్థితి బాగులేదు. గడ్డు రోజులు ముందున్నాయి. మనస్సు గాయపడుతూంది. కలసిరాని ఆలోచనలు, కారణం లేని కలహాలు తప్పవు. కన్నవారితో నే కలహిస్తావు. కోరినవాడితో పెళ్లి...

రాధ :- (ఆతురతతో) ఆ ! పెళ్లి!

ముర :- (సందేహిస్తూ) పెళ్లి !

కొండ :- డవుటెందుకు ? చెప్పు గురూ !

ముర :- (బరువుగా) జ___రు___గ___దు.

రాధ :- ఆ ! జరగదూ !

ముర :- అనే దేవి చెప్తూంది.

రాధ :- చూశావా ! కొండయ్యా (జాలిగా అంటుంది.)

కొండ :- ఏంటి గురూ ! ఏంటీ ఎదవ జోతిష్యం. అనవసరంగా ఆడకూతురు నేడిపిస్తున్నావు ?

ముర :- ఏడుపెందుకు శ్రీమతీ ! కాబోయే భర్త చాల మంచి వాడు. ఆస్తి కలవాడు. అందమైనవాడు. మీ బావ కన్న......

రాధ :- బావను మీా రెరుగుదురా ?

ముర :- (కళ్లు మూసుకుని) చూస్తున్నాం. జ్ఞాన దృష్టితో చూస్తున్నాం. అవును- నిన్ను ప్రేమించేవాడు. లాలించే వాడు.

రాధ :- (కోపంగా లేచి) చాలు నీ డాబులు. పో అవతలకు.

ముర :- జై బోలానాధ్ (లేస్తాడు)

కొండ :- బోల్తా కొట్టాడు గురూ ! బోలానాధ్ !

ముర :- ఫ్యాక్టు చెప్పాం. అదృష్టాన్ని వద్దనకు. ఆలోచించుకో. ఆ పెళ్లికే ఒప్పుకో శ్రీమతీ !

రాధ :- పోతావా! పోవా! ఊఁ.

కొండ :- పగటివేషగాడిలా పట్టుకుని వదలవేం? చెప్పుదెబ్బల తినకుండా జారిపో గురూ! (బయటకు పంపించబోగా

ముర :- కొంచెం తగ్గవోయ్! కొండయ్యా! (గెడ్డం, మీసం తీసేస్తాడు.)

కొండ :- (ఆశ్చర్యంగా) మురళీబాబా!

రాధ :- (ఆశ్చర్య సంభ్రమాలతో) బావా!

ముర :- రాధా!

కొండ :- బలే నాటక మాడేవయ్యా!

రాధ :- ఎందు కీసన్యాసి వేషం?

కొండ :- కాఫీ డబ్బులు కోసం.

ముర :- దేవి దర్శనం కోసం.

కొండ :- అవునమ్మా! ఆ నాడు సుభద్రమ్మను కలుసుకోడానికి అర్జునాసా మీలాంటి సన్యాసి వేషమే వేసాడు. అప్పుడు శ్రీకృష్ణ పరమాత్మా! (పురాణ ఫక్కీలో చెప్పబోతాడు)

ముర :- కృష్ణ పరమాత్మా! కాస్సేపు గుమ్మం దగ్గర కనిపెట్టి ఉండు. మావయ్య రాగలడు.

కొండ :- బలే డ్యూటీ వేసావయ్యా! కృష్ణపరమాత్మా! (బయటకు పోతాడు.)

రాధ :- బలే వేషం వేసావు బావా!

ముర :- ఇంతేనా! ఇంకెన్ని వేషాలేయాలో నీకోసం.

రాధ :- నన్ను మరచిపోయేవనే అనుకున్నాను.

ముర :- మరచిపోదామనే అనుకున్నాను.

రాధ :- (ఆశ్చర్యంగా) ఆ!

ముర :- అవును. మనిద్దరికీ పెళ్లి చేయడం మీ నాన్నకీ ఇష్టం లేదు— మా నాన్నకీ ఇష్టంలేదు. నాకూ-డా ...

రాధ :- ఇష్టం లేదా ?

ముర :- లేదనే అనుకో.

రాధ :- (నిరుత్సాహపడి) ఎంత మోసం చేసావ్. (పాజ్) నిన్ను నీ మాటల్ని నమ్మేను. నిజంగా ప్రేమిస్తున్నావని ఆశించేను. నీవే నా భర్త కావాలని కలలు కన్నాను. నా ఆశ నిరాశ చేస్తావా ? నమ్మించి మోసం చేస్తావా ? పో, వెళ్లిపో. ఒక్క క్షణం ఇక్కడుండవద్దు. వెళ్ళిపో.

ముర :- రాధా! రాధా !

రాధ :- ఇంకేం చెప్పొద్దు. వెళ్ళిపో. (ముఖానికి చేతులు అడ్డం పెట్టుకొని ఏడుస్తోంది.)

ముర :- నా మాట విను, రాధా.

రాధ :- వినక్కర్లేదు. పో. వెళ్ళిపో.

ముర :- చెప్పేది పూర్తిగా విని.

రాధ :- ఇంకేం వినాలి ? చెప్పేవుగా ! ఇష్టంలేదని పెళ్లని.

ముర :- ఇష్టం లేనివాడి నెందుకొచ్చానంటూ విక్కడికి ?

రాధ :- ఇదో నాటకం !

మురః- కాదు రాధా! నిజం! నా హృదయంలో నీకు శాశ్వత స్థాన మిచ్చేను. నిన్నే పెళ్లి చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. మన కలయికతో జీవితం ఆనందంగా గడపగలమని ఆశించేను. (రాధ వింటూంటుంది.) కాని మన పెద్దలు వేరుగా నిర్ణయిస్తున్నారు. మనల్ని వేరుచేయబోతున్నారు. వాళ్ళను కాదని మనం ఎలా పెళ్లి చేసుకోగలం? చేసుకున్నా ఏం సుఖపడగలం?

రాధః- ఏమైనా సరే నిన్ను మరచిపోలేను. బలవంతం పెళ్లికన్న బలవంతం చావునే వరిస్తాను. (కళ్ళనీళ్లు రాలుతాయి)

మురః- ఛా! ఛా! మిలా మిలా మెరిసే కళ్లల్లో కన్నీళ్లా! నేను చూడలేను. ఏదీ నవ్వు. (నవ్విస్తాడు. రాధ నవ్వలేక నవ్వుతుంది) ఆ! రైట్! ఇప్పుడు చెప్పు. మన పెళ్లి జరిగి తీరాలి. అంతేనా?

రాధః- ఔను.

మురః- జరిపిస్తాం. జై భోలానాథ్! (ఆలోచించి) ఆ! తట్టింది.

రాధః- ఏమిటది?

మురః- ప్చ్! ప్చ్! (పెదవి విరచి) లాభం లేదు. వీళ్ళనుకాదని ఏం చేసినా, వెధవ లోకం— నోటికొచ్చినట్లు కూస్తుంది. అపవాదులు వేస్తుంది. అందరికి అప్రతిష్ట. పెద్దల ఆశీర్వాదంతోనే పెళ్ళి జరగాలి.

రాధః- అదెలాగా?

మురళి :- ఎలాగా ? (ఆలోచిస్తూంటాడు) ఏం చేద్దాం? మధ్య నీ పైకుంత మొకడొచ్చాడు. మాటా మాటా పెంచి మరింత రెచ్చగొడుతున్నాడు. వీడి బ్రతుకు బయట పెట్టాలి. మనవాళ్ళ మనసులు మార్చాలి. అంతే. చిన్న నాటకం ఆడాలి.

రాధ :- నాటకమా ?

మురళి :- ష్! ఇలారా (చెవిలో ఏదో చెప్తాడు.)

రాధ :- (విని) అమ్మో నాన్నకు తెలిసిపోదూ!

మురళి :- మరేం ఫర్వాలేదు. అలా చేస్తేనే తప్పీమని ఈ పెళ్లి ఆగిపోతుంది. గండం గడచిపోతుంది.

రాధ :- ఒకవేళ రోగంతోనే పెళ్లి చేసుకోమంటే —

మురళి :- అంతటి మహానుభావుడేలే!— (పాజ్) చేసుకోమని ఈయన చెప్పొచ్చుకాని, చేసుకునేవాళ్లు ఒప్పుకోవద్దూ?

రాధ :- వాళ్లూ ఒప్పుకుంటే—

మురళి :- డార్లింగ్! ఇలాంటి పరిస్థితులలోనే 'డేరింగు' కావాలి. ఆడది తలచుకుంటే అడ్డుంటుందా? సమయానుకూలంగా సంచరించుకో. ఎత్తుకి పై ఎత్తు వేస్తూ ఎప్పటికప్పుడు 'ఎడ్జెస్ట్' చేస్తూంటా. మనిద్దరికీ 'మీడియేటర్' మిస్టర్ కొండయ్య!

రాధ :- ఎంత మంచివాడవు మురళీ. పెళ్ళి జరగదేమోనని నిజంగా బెంగపెట్టుకున్నాను.

మురః- అయ్యో! పాపం! (చిలిపిగా అంటాడు.)

రాధః- పో! బావా! ఎప్పుడూ ఇంతే (ఇద్దరూ కులాసాగా ఉంటారు.)

(పాట)

[కొండయ్య తొందరగా వస్తాడు.]

కొండః- వొత్తున్నారయ్యా! వొత్తున్నారు.

మురః- (తొట్రుపాటుగా) అప్పుడే! కృష్ణపరమాత్మ. (గెడ్డం మీసం తగిలించుకుంటాడు.)

రాధః- వస్తా! బావా! (లోనికి పోతుంది.)

మురః- జై బోలానాథ్! ("ఏం చేస్తాం" అన్నట్టు అంటాడు)

[శరభయ్య రిక్షావాడికి డబ్బులిచ్చి లోనికివస్తూ]

శరః- అంతే! అర్ధణాకూడా ఎక్కువియ్యను. ఇష్టమైతే పుచ్చుకో. లేకపోతే పో. కొండయ్యా! ఆ పార్శిల్సు ఇలా తీసుకురా (లోనికి అడుగువేస్తూ) పీరెవరు ?

మురః- పామిష్టులం మాష్టర్జీ! చేయి చూస్తాం!

శరః- ఎవరు రమ్మన్నా రిక్కడికి?

కొండః- (పార్శిలుతో వస్తూ) ఇంకా ఇక్కడే ఉన్నావా ? వెళ్లు బాబూ వెళ్లు. ఇవిగో నీడబ్బులు (మెల్లిగా) ఎళ్లవయ్యా.

మురః- జై బోలానాథ్! (ముందుకు నడుస్తూంటాడు.)

శరః- కొండయ్యా ! వీడి నెందుకు రానిచ్చావు లోపలికి?

కొండః- అబ్బే లేదయ్యా ! చెయ్యి చూత్తానంటే తమాషాకి చూడమన్నాను.

శర :- అదేదో అవతల ఏడవలేక పోయావ్! బుద్ధిలేదూ!

మురః- జై భోలానాథ్! అనుకూలంగా లేవు గ్రహాలు. అన్నీ ఆటంకాలే! ఎక్కువవుతాయి చికాకులు. మాట నెగ్గడం కష్టం.

శర :- నోరుమూసుకుని పోతావా ? పోవా ?

మురః- పోతున్నాం! మళ్లీ కలుసుకుంటాం! జై భోలానాథ్.

(పోజిచ్చి వెళ్లి పోతాడు)

శర :- (కోపంగా) కొండయ్యా ! ఇలాంటి సన్యాసుల్ని లోప లికి రానిచ్చావంటే నిన్ను "డిస్‌మిస్" చేస్తాను! ఆ!

కొండ :- లేదయ్యా ! లేదు.

శర :- ఆ పార్సిల్ను ఇలా తీసుకురా.

కొండ :- (అలా చేస్తాడు.)

శర :- ఏదీ! ఆ ప్యాకెట్టు! (విప్పుతూంటాడు.)

[వైకుంఠం లోపలికి వస్తాడు]

వైకుం :- (వస్తూనే) పెళ్లివారు చాలహడావిడిగా ఉన్నారే!

శర :- రావయ్యా ! రా (వైకుంఠం కూర్చుంటాడు) చూడు ఎలా ఉందీ చీర ?

వైకుం :- ఫస్టుక్లాసుగా ఉంది. అమ్మాయికి రంగు అద్భుతంగా సూటవుతుంది.

శర :- ఎంతివ్వచ్చునంటావు దీనికి ?

వైకుం :- ఏం చెప్పగలం? (చీరచూస్తూ) ఓ పచ్చకాగితం....

శర :- ఒకటా? రెండు, పాతిక తక్కువగా.

వైకుం :- అబ్బా! చాలా ఖరీదే!

శర :- ఏమనుకుంటున్నావ్. ఇది 125 రూ॥ల 75 నయాపైసాలు, ఇది 93 రూ॥ల 28 నయా పైసాలు. ఇవన్నీ మామూలు చీరలే లే. అంతా మొత్తం మూడు పచ్చ కాగితాలిచ్చాను, అరుణా స్టోర్స్‌కి.

వైకుం :- అదీ ఒక గొప్పే నీ బోటి ఆఫీసరుకి.

శర :- అలానే అనుకుంటారులే. గుప్పిడి మూస్తేనే ఆ గొప్పం. (నెక్లెసు బాక్సు 'ఓపెన్' చేస్తూ) చూడు. వాళ్ల నెక్లెసు. ఇవి రవ్వలగాజులు. స్పెషల్‌గా ఆర్డరిచ్చి చేయించా. మొత్తం వెయ్యి రూపాయలు దాటింది.

వైకుం :- అవుతుంది. ఈ నగలు,- ఆ చీరలు అలంకరించుకుంటే అమ్మాయి అచ్చు "లక్ష్మీ—లక్ష్మీదేవే".

శర :- లక్ష్మే! అదంతా తల్లి పోలిక. చూడు! ఆ ఫోటో! ఎంత నిండుగా ఉందో! ఎంత సజీవంగా ఉందో. అదే బ్రతికుంటే పెళ్లిపీటలమీద కూతురిని అల్లుడిని చూచుకుని ఎంత మురిసిపోయేదో! అల్లుడొస్తున్నాడంటే ఎంత హడావిడి చేసేదో!

వైకుం :- ఆవిడకేం. పసుపు, కుంకంతో హాయిగా వెళ్లిపోయింది. ఉన్నాంగా మనం అన్నీ అనుభవించడానికి.

శర :- అంతేలే. (నిట్టూరుస్తాడు)

వై కుం:-(విషయం మార్చదలచి) అమ్మాయి యివన్నీ చూసిందా?

శర :- మరచిపోయా ! కొండయ్యా ! పిలవరా ! అమ్మాయి నొక సారి.

కొండ :- అయ్యా (లోనికి పోవును.)

(లోనుండి :- "నేను రాను. నన్ను చంపుకు తినకు పో" అని రాధ అంటుంది.)

శర :- అదిగో ! విన్నావా. మామూలు ధోరణే ! ఏ మందులు పనిచేయడం లేదు. ఎన్ని విధాల 'ట్రై' చేసినా మారకుండా ఉంది ? ఏం దారి ?

వై కుం :- పెళ్లయిందనిపించు. అన్నీ చప్పగా కుదరకపోతే నన్నడుగు.

కొండ :- (వచ్చి) రానంటున్నారండీ.

శర :- అంటున్నారా అండీ (విసుగ్గా) వెధవాయి.

వై కుం :- మంచి చీరలు, నగలు తెచ్చారని చెప్పరా.

కొండ :- చెప్పినా వినడం లేదయ్యా.

శర :- సరే! వైకుంఠం. ఒక్క క్షణముండు నేనే చూపించివస్తా ! అవన్నీ ఇలా పట్టా! (కొండయ్యతో లోనికిపోతాడు.)

వై కుం :- మెల్లిగా నచ్చచెప్పు (వాళ్లు వెళ్లేక) రామానుజ ! అమ్మాయి మాటకి చెవొగ్గడుగదా శరభయ్య. (పాజ్) అలా జరగనిస్తామా ?

లోనుండి— "నామీకే వద్దునాన్నా! నన్ను మాట్లాడించకండి. నాజోలికి రాకండి. ఇలా పడవనివ్వండి.")

శర :- (విసుగుతో హాలులోనికి వస్తూ) ఏమో! బాగాపడుం. నాన్న ఎందుకు బ్రతికున్నాడా అని గట్టిగా ఏడుం. శని విరగడై పోతుంది. (కూర్చుంటాడు.)

వైకుం :- ఏమిటామాట. పెద్దవాడివి. చికాకుపడితే ఎలా ?

శర :- ప్రాణం తీస్తోంది. ఇదేం దరిద్రమో. ఛ! ఛ! ఇలాంటి పిల్లలు ఉంటేనేం ? ఊడితేనేం ?

వైకుం :- శుభమాఅని పెళ్లి చెయ్యబోతూ......... ?

శర :- ఆ పెళ్ళితోనే వచ్చిం దీచికాకంతా! నామాటే కాదం టోంది.

వైకుం :- అంటుంది. అంటుంది. అనేలా చేసారు వాళ్లు. మందో మాకో పెట్టేసారు. మతి విరిచేసారు. తండ్రినే కాదనే స్థితికి తెచ్చారు.

శర :- అలాగే అనిపిస్తోంది.

వైకుం :- అంతే! కోపంవస్తే చెప్పలేను. ఇదంతా ఆయన ఎత్తే. పద్మనాభండే— వేసాడు ప్లాను—కొడుకు నంటగట్టి ఆస్తి అంతా కాజేద్దామని. అర్థం చేసుకోలేకపోయేవు. అబ్బా యిని, అమ్మాయిని చనువుగా మసలనిచ్చేవు—అక్కర లేని గొడవలన్నీ నాకెందుకు ? రామానుజ.

శర :- కావలసినవాడే కదా అని కాదనలేకపోయా!

వైకుం :- అదే కొంప ముంచింది. పద్మనాభానికి నీ జుట్టు చేతి కిచ్చింది. ఆడిస్తున్నాడాట. మొన్న వ్రతంనాడు

చూసేంగా. బావమరిది అని మర్యాదా! గౌరవమా!

రామానుజ.

శర :- వైకుంఠం! ఇక వాళ్ళసంగతి ఎత్తకు. నేనొక నిశ్చయా
నికి వచ్చేసా! శిఖ్రుడష్టం వచ్చినాసరే! శ్రీశైలం సంబం
ధమే చేసుకుని తీరుతాను.

వైకుం :- ఆమాటే— మీవాడితో అన్నాను.

శర :- నువ్వేందు కన్నావు?

వైకుం :- ఏదో, మామూలుగా అనేసా. దానితో లేచాడు
తారాజువ్వలాగా? అబ్బబ్బ! ఎన్ని తిట్లేడు.

శర :- నన్నే! ఏ మన్నాడు?

వైకుం :- అక్కరలేని గొడవలన్నీ నాకెందుకు? రామానుజ!

శర :- అదేమిటి! ఏమన్నాడు చెప్పు!

వైకుం :- ఏమన్నాడా? "చూస్తాను. ఈ పెళ్లి ఎలా జరుగు
తుందో చూస్తాను. పీటలమీద పెళ్లిళ్లు తిప్పేసే ప్లాను
నాకు తెలుసు. శరభయ్యను నలుగురిలో "ఛీ" అనిపిం
చకపోతే........!

శర :- ఆ! అంతమాటే! అన్నాడా?

వైకుం :- అన్నాడు. ఆ కబురు నీ చెవిని పడేద్దామనే అలా
పోయేవాడినిలా వచ్చేసా.

శర :- సరే! నేను చూస్తాను. పెళ్లి ఆపుచేసి పద్మనాభం
ఈ ఊళ్లో ఎలా బ్రతకగలడో చూస్తాను. కోర్టు కీడ్పించి

కొంపా, గోడే వేలంవేయించే మార్గం నాకు తెలుసు. ఏమనుకుంటున్నాడో ?

వైకుం :- తలచుకుంటే అదెంత నీకు ? ఈ లోగా చెప్పేడు మాటలు విని శ్రీశైలం అటు తిరిగి పోకుండా చూసుకోవాలి.

శర :- ఆ 'డవుటు' వచ్చిందంటే కట్నం పెంచుదాం. సొమ్మంటే చేదా, శ్రీశైలానికి ! — మిగతా పూచీ అంతా నీదే.

వైకుం :- వద్దంటే తప్పడంలేదీ వ్యవహారాలు నాకు. నెత్తిన వేస్తున్నావు పెద్ద బాధ్యత— ఆ ! బాధ్యతంటే గుర్తొచ్చింది. చూడు బాబూ, ఈ 'అప్లికేషను'.

శర :- (తీసుకొని) ఎవరిది?

వైకుం :- మన సంగీతం మేష్టారు — శర్మగారబ్బాయిది (శర భయ్యా చదువుతూంటాడు) వీలుకాదు బాబు అన్నా. విన్నాడు కాదు. "మావాడి కింత భిక్ష పెట్టే పూచీ మీదే"నని పడేసాడీ కాగితం నా మీద.

శర :- ఆ మధ్య నన్ను కలుసుకొని మాట్లాడేడు " వేకెన్సీ " వచ్చినప్పుడు చూద్దామన్నాను.

వైకుం :- చూద్దాం కాదు. చేద్దాం అను. ఎవరికైనా మట్ట చెప్పవలసిన అవసరముంటే.... ....

శర :- లంచ మిస్తాడా !

వైకుం :- అబ్బెబ్బె ! మనకి కాదు. ఎవరికైనా !

శర :- ఆ మాట ఎత్తితే అసలు పనిజరగదని చెప్పా.

వైకుం : అలాగే (పాజ్) గంపెడాశతో ఉన్నాము మనమీద. ఏదో మాట దక్కించు. "ముఖ్యస్నేహితులు మీరు, 'రికమెండు' చేయక తప్పదని" పట్టుకున్నాము. ఉపకారం అంటే—ఆ ఉన్నానంటూగా! అదే కొంప ముంచుతోంది.

(లోనుండి కొండయ్య పరుగున వస్తాడు)

కొండ :- కొంప మునిగి పోయిందయ్యా! (అటూ యిటూ పరుగెత్తుతాడు)

ఇద్దరు :- ఏరా ? ఏం జరిగింది ?

కొండ :- ఏం చెప్పను ! ఘోరం ! మహాఘోరం !

వైకుం :- చెప్పరా ! సంగతేమిటో.

కొండ :- అమ్మాయిగారు అమాంతంగా మేడమీదనుంచి క్రిందికి............

ఇద్దరు :- దూకేసిందా ?

కొండ :- దూకబోతే వెనక్కి లాగేసా.

ఇద్దరు :- లాగేసావా !

కొండ :- ఓ ! లాగేసి పరుపుమీద పడేసాను. అంతే! కళ్ళు మూతలు పడ్డాయ్. కాళ్ళు చల్లబడ్డాయి కదలకుండా తొంగున్నారయ్యా.

శర :- అయ్యోయ్యో ! ఆ 'ఫిట్' వచ్చినట్లుంది. (తొందరగా లోనికిపోతూ వెనక్కు వచ్చి) కొండయ్యా నిలుచున్నావేం! డాక్టరుని తీసుకురారా. (మళ్ళీ వెనక్కివచ్చి) ఒక్కడిని

కాదు ఇద్దరిని. ఆహా! నలుగురిని! —కాదు ఇద్దర్నే, నరహరిని, పశుపతిని; అర్జెంటుగా తీసుకురా. వెళ్లు వెళ్లు వస్తున్నా నమ్మా, వస్తున్నా, రాధమ్మా (వెళ్లిపోతాడు.)

కొండ :- అయ్యో, నారదమునీ!

వైకుం :- ఏమన్నావ్ ?

కొండ :- అంటున్నారయ్యా ఆళ్లంతాను.

వైకుం :- అంటారు (పాజ్) వెళ్లు, వెళ్లు డాక్టర్లని పిలు—

కొండ :- అయ్యో! (పాజ్) నోఖరోడంటే అందరికీ లోకువే. (వెళ్లిపోతాడు.)

వైకుం :- రామానుజ! కథ రక్తిలో పడింది. మన ఇన్‌జక్షన్ పని చేసింది. పొరపాటునైనా కూతురిమాట వినడు శరభయ్య. పద్మనాభాన్ని కూడా మన "లైను" లోనికి లాగేస్తే — నెగ్గేమన్నమాటే. చక్రపొంగలి భోగం చేయిస్తా— శరభయ్య చేత! రామానుజ (వెళ్లిపోతాడు)

— తెర —



# మహా తపరంగం

(పద్మనాభం ఇల్లు. పంచపైకి ఎగగట్టి, తలకు తువ్వాలు చుట్టు కొని హాలులో బూజులు దులుపుతూంటాడు పద్మనాభం. డాక్టరు నరహరి లోనికి వస్తాడు.)

నర :- (పద్మనాభాన్ని గుర్తించకుండా) ఏయ్ ! మనిషి !

పద్మ :- (పలుకకుండ పని చేస్తూంటాడు)

నర :- ఏయ్‌మనిషి ! నిన్నే ! (దగ్గరగా వెడతాడు.)

పద్మ :- ఎవరది ? (ఎదురు తిరుగుతాడు.)

నర :- (కంగారుగా) ఆ ! మీరా ? మీరే ! ఎవరో కూలాడను కున్నాను. 'ఎక్స్‌క్యూజ్.' (Excuse)

పద్మ :- మాట్లడితే ఎక్స్‌క్యూజ్ ! (బూజులకర్ర మూలపెట్టి కుర్చీలో కూర్చుంటూ నరహరిని కూర్చోమంటాడు.) డాక్టరుగారూ ! మీరన్నదాంట్లో తప్పేమివుందండి ! ఈ ప్రపంచం అంతా పెద్దఫ్యాక్టరీ ! అందులో మనందరం పనిచేసే కూలీలమే. మనందరికి ప్రొప్రయిటరు ఆ భగవంతుడు— ఆయన ఆర్డర్ల ప్రకారమే అంతా తలోపని చేస్తున్నాం. ఒప్పుకుంటారా ! లేదా ?

నర :- (కూర్చుని) అవుననుకోండి.

పద్మ :- అనుకోవడమేమిటి ? అదే యదార్థం ! కాదంటారా ! 'కమాన్' ! 'ఆర్గ్యూ' చెయ్యండి.

నర :- 'ఆర్గ్యూ' చేయడానికి నాకు తీరికేది. ? అర్జంటు కేసులు 'ఎటండు' కావడానికే టైము చాలక చస్తున్నాను.

చూసేరుగా! హాస్పటల్లో ఎంతమంది అలా "క్యూ"లో నిలబడి ఉంటారో!

పద్మ :- అదృష్టవంతులు 'ప్రాక్టీసు' బాగుంది—పైసా వస్తూంది.

నర :- వెధవపైసా! ఇలావస్తుంది—అలాపోతుంది. అది కాదండీ మనకు ముఖ్యం—పేరు— పదిమంది మన పేరుమీాద బ్రతకాలి. మనం పనిచేసేది ఫీజుకోసం కాదు—ప్రజల కోసం.

పద్మ :- అదివేరే చెప్పాలా? మీా పాత సైకిలే నిదర్శనం. మరో డాక్టరయితే కారుకొనడూ ఈ పాటికి?

నర :- కార్లు, మేడలు, కావాలంటే 'పేమెంట్లు' నేడిపించాలి. డబ్బు గుంజుకోవాలి. అది ఇష్టం లేకనే—సింపిలుగా సైకిలుతోనే 'మేనేజ్' చేస్తున్నా!

పద్మ :- కొన్నాళ్ళ లాగే చెయ్యండి బాబూ! లేకపోతే చచ్చిపోగలరు ప్రజలు— ఫీజు యిచ్చుకోలేక.

నర :- (లేచి పద్మనాభాన్ని ఎగ్జామిన్ చేస్తూ) నిన్న రాత్రి మందేసుకున్నారా?

పద్మ :- ఆ!

నర :- తగ్గిందా! దగ్గు.

పద్మ :- ఎక్కువయింది.

నర :- ఎక్కువయిందా?

పద్మ :- కంటిమీాద కునుకు ఉంటే ఒట్టు. ఆయాసం, దగ్గు. ఎగ ఊపిరి, దిగ ఊపిరి— ఆ కాస్త ప్రాణం ఎగిరిపోతుందనే అనుకున్నా.

నర :- మరేం ఫరవాలేదు. ఎక్కువయిందంటే మందు పనిచేసిం
దన్నమాట.

పద్మ :- అదేమిటి ? తగ్గడాని కిచ్చేరా......

నర :- ఎక్కువై తగ్గడాని కిచ్చాను. అదే మన 'థీరీ'.

పద్మ :- ఎప్పటికైన తగ్గేయోగ ముందంటారా !

నర :- గన్‌షాట్‌గా ! కొంచె మోపిక పట్టండి.

పద్మ :- ఈ రాత్రి కూడ— చెయ్యాలంటారా జాగారం.

నర :- అంతబాధ ఉండదు. ప్రాణాని కేమి ఫరవాలేదు.

పద్మ :- ఏమిటో ! ఇంత చిన్నచిన్న పంచదార మాత్రలవల్ల పని
జరుగుతుందా అని !

నర :- మంచిపనే ! అలా తేలిగ్గా చూస్తున్నారా ! ఆ చిన్న
మాత్రే- ఒక్కటిస్తేచాలు— ఆ లోకానికే యాత్ర.
ఇలాగే డౌటొచ్చింది మన కలెక్టరుకి.

పద్మ :- ఏ కలెక్టరు ?

నర :- టిక్కట్టు కలక్టరు జోసఫండీ. డాక్టర్లంతో మంది "డౌట్
ఫుల్" అన్న కేసది. "క్యూర్ చెయ్యగలరా ?"
అన్నాడు జోసఫ్. చేస్తానన్నాను. ఇచ్చేను గ్యారంటీ.
వాడేసు మందులు— అమోఘం— అద్భుతం— ఆశ్చర్యం.
ఆరు వారాలకల్లా అమాంతంగా లేచి తిరిగా డాపేమంటు.

పద్మ :- మరి నాదేం ఖర్మ. ఎనిమిది వారాలైనా ఏమీ గుణం
కనిపించదేం ! (దగ్గుతాడు)

నర :- క్వైట్ రైట్. కచ్చితమైన ప్రశ్న వేసారు. (పాజ్) చెప్పిన పత్యాం చేస్తున్నారా మీారు?

పద్మ :- అహా!

నర :- ఆవకాయ తినడం మానేసారా?

పద్మ :- మానేసాను. అప్పుడప్పుడూ పిండిలేని పెచ్చుమాత్రం...

నర :- ఆవకాయ జాడీ అవతల పారేస్తేగాని మీాకీ జబ్బుతగ్గదు. కారం ఎక్కువ తింటే కోపం ఎక్కువవుతుంది. కోపం వల్ల కలహాలు పెరుగుతాయి. మనస్థిమితం ఉండదు. మరి మందులేం పనిచేస్తాయి? (సిరెంజి తీస్తుంటాడు)

పద్మ :- మానేసానండి కారం తినడం.

నర :- మానేస్తే ఏలా? తినండి. (సిరంజీలో మందు తీస్తూ) ఇంజక్షను ఇస్తాను.

పద్మ :- తప్పుతుందా. సూది శుభ్రంగానే ఉందా?

నర :- (నవ్వుతూ )ఇదిగో చూడండీ! (చూపిస్తాడు)

(బయటనుండి " మావా! మావా! " అంటూ వైకుంఠం వస్తుంటాడు )

పద్మ :- ఎవరూ! రామానుజా! రావయ్యా! రా!

వైకుం :- (వస్తూ) ఇంట్లోనే ఉన్నావా? (నరహరిని చూచి 'సడన్'గా ఆగిపోతాడు) డాక్టరుగారా! నమస్కారం సార్

నర :- నమస్తే! మన ......

వైకుం :- బిల్లుమాటేగా... నెలాఖరికి పంపించేస్తా!

నర :- (నవ్వుతుని) కాదండీ ప్లాను ! (ఇంజక్షను ఇస్తూ)

వైకుం :- అవుతోంది ! అవుతోంది— ఏ ప్లాను ?

నర :- కుష్టురోగుల హాస్పటలు ప్లాను (సిరంజ్ బాక్సులో పెడుతూ)

వైకుం:- అబ్బా ! అంచలు అంచలు వారిగా అవుతోంది. నెలా రెండు నెలల్లో రెడీ అయి పోతుంది.

పద్మ :- ఏం ? వసూలు చేసిన చందాలు చాలలేదా !

వైకుం :- సరిపోతాయా? అయిదు—పది వొస్తుంటే దానిమీదే పెడుతున్నాం.

పద్మ :- ఏమేవ్! నీళ్లు- సబ్బు అక్కడుంచు.

(లోనుండి "ఆ ! వస్తున్నా !")

నర :- ఇకముందైనా జాగ్రత్తగా పత్యం చేయండి (చెయ్యి కడుక్కోడానికి వెడుతూ)

వైకుం :- ఆమాట మా అత్తతో చెప్పండి—ఈయన కక్కూర్తి మనిషి.

(నరహరి లోనికి వెడతాడు)

వైకుం :- ఏమయ్యా ! తెలిసిందా ! మేనకోడలు పెళ్ళి !

పద్మ :- (పట్టించుకోకుండా) ఏదో ఏడుస్తారు పోనిద్దూ.

వైకుం :- ఏడుస్తున్నారులే ! నీ పేరు చెప్పుకొనే ఏడుస్తున్నారు. రామానుజ !

వైకుంఠం

పద్మ :- ఆ! (అని వైకుంఠాన్ని ఏమో అడగబోతుండగా లో నుండి చేతులు తుడుచుకుంటు నరహరి, వీధిలో నుండి కంగారుగా కొండయ్య వస్తారు.)

కొండ :- అయ్యా! అయ్యా! డాక్టరుగారూ!

నర :- ఏం! కొండయ్యా! ఏం?

కొండ :- అర్జంటుగా రాండయ్యా. అమ్మాయిగోరికి "సీరియస్" గా ఉంది. గంటసేపటినుంచి ఎతుకుతున్నా మీకోసం.

నర :- అరరె! అంతపని జరిగిందా. వస్తున్నా ఉండు. (మందు పొట్లాలు కడుతూంటాడు.)

వైకుం :- ఆ "ఫిట్" ఇంకా తగ్గలేదా కొండయ్యా!

కొండ :- వొత్తూంది, పోతూంది— పోతూంది, వొత్తూంది. పొద్దుటినుంచీ అంతే.

నర :- (పద్మనాభంతో) ఇవిగో మూడు పొట్లాలు. మూమూలుగానే వేసుకోండి. మళ్లీ కలుసుకుంటా. నడు కొండయ్యా.

(ముందు కొండయ్య, వెనుక నరహరి పోతూంటారు.)

వైకుం :- (లేచి) ఉండండి! డాక్టరుగారు! నేను వస్తున్నా. (పోబోతాడు)

పద్మ :- (బలవంతాన ఆపుచేసి) వైకుంఠం.

వైకుం :- ఉండవయ్యా! అవతల అర్జంటు.

పద్మ :- నీకేం అర్జంటు ? డాక్టరు వెడుతున్నాడుగా !

వైకుం :- కొంప మునిగిపోతుందయ్యా అంటుంటే.

పద్మ :- ఫర్వాలేదు ! కూర్చో. (కూర్చుండ చేస్తాడు) మాట్లా
డాలి. ఇదీ అర్జంటే.

వైకుం :- మాట్లాడుదాం— మళ్ళీ వస్తాగా. (లేవబోతాడు)

పద్మ :- కూర్చోమంటే. ఏమన్నావ్ ? నా పేరు చెప్పుకొని
ఏడుస్తున్నారా ?

వైకుం :- ఏడవరూ ! కూతురు ప్రాణంమీద కొస్తే.

పద్మ :- మధ్య నేనేం చేసాను ?

వైకుం :- ఏమో ! నాకేం తెలుసు.

పద్మ :- నీకు తెలుసు. నువ్వు దాస్తున్నావు. ఏం అననులే.
చెప్పు. ఏం తిడుతున్నాడో ?

వైకుం :- అక్కరలేని గొడవలు నాకెందుకు ? రామానుజ.
(లేచి పోబోతాడు.)

పద్మ :- అంతే! "మావా! మావా!" అంటూ మాటి మాటికి
వచ్చి అయిదూ పదీ పట్టుకు పోతూంటావే !

వైకుం :- ఊరికే ఇచ్చావా! లాటరీ టిక్కట్టు కొన్నావు.

పద్మ :- ఏమయితేనేం ! అమాత్రం మొహమాటం ఉండొద్దూ?
మరెప్పుడూనా అవసరం రాదూ— ఏం మాట్లాడవేం ?

వైకుం :-ఏం మాట్లాడను? ఏదో అన్నాడే అనుకో— ఎందు
కదంతా ! ఏం చేద్దామని.

పద్మ :- నాక్కావాలి. ఏం తిట్టేడో నేను వినాలి.

వై కుం :- అలా కండిషనుగా అడిగితే ఏం చెప్పను మావా ? చెప్పేక బుజా విప్పించమంటే ఏం చెయ్యను.

పద్మ :- అలా అడగను. మన మాటలు మనలోనే ఉంటాయి. చెప్పు.

వై కుం :- చాలా అన్నాడు— (ఆలోచించి) ఆ! వ్రతానికి వచ్చి నప్పుడు మర్యాద చేయలేదట— భోజనం చెయ్యమన లేదట.

పద్మ :- భోం చెయ్యనని భీష్మించి కూచున్నాడుగా !

వై కుం :- నువ్వు బ్రతిమాలలేదట.

పద్మ :- బ్రతిమాలుతానా! ఆయనకేనా ఆ బెట్టుసరి? నేనూ ఉప్పు, కారం తింటున్నా.

వై కుం :- రైటే ! ఆయనకు మాత్రం చాల కోపం వచ్చింది.

పద్మ :- వచ్చి ఏమంటాడు ?

వై కుం :- మూర్ఖుడే వన్నాడు. ముక్కోపి మనిషి వన్నాడు. అబ్బాయి నంటగట్టి ఆస్తి పడేసుకుంటామని చూస్తు న్నావుట. ఇలాగే —

పద్మ :- ఇంకో ఇంకో ! 'Actual'గా ఏమన్నాడు ?

వై కుం :- చెప్పమంటావా ! చెప్పమంటావా ! 'చూస్తాను; నన్ను కాదని, పద్మనాభం ఈ ఊళ్లో ఏలా బ్రతుకగలడో చూస్తాను. కోర్టు కీడ్పించి కొంప వేలం వేయించేస్తాను.

చిప్ప చేతికిచ్చి తంగ్రడికొడుకు లిద్దరు "భిక్షాం దేహి" అంటూ అడుక్కు తినేలా చేస్తాను" అన్నాడు.

పద్మ :- (ఒక్కసారి ఉద్రిక్తురాలై) శరభయ్యా! (వైకుంఠం గొంతుకు పట్టుకుంటాడు.)

వైకుం :- చచ్చేను-బాబోయ్-నేను.

పద్మ :- దొంగముండాకొడుకా! చిప్ప చేతికిస్తావా!

వైకుం :- నేను—నేను వైకుంఠం—వైకుంఠం (విడిపించుకుంటాడు)

పద్మ :- (ఆయాసం—దగ్గుతో) వైకుంఠం! (కూర్చుంటాడు.)

వైకుంఠం :- అమ్మయ్యో! దణ్ణం. బాబోయ్ దణ్ణం (పారిపోతాడు.)

పద్మ :- (వెంబడిస్తూ) వైకుంఠం! వైకుంఠం! ఏమి అనను. రా!

(గుమ్మం వరకు వెడతాడు. వీధిలో నుండి మురళి వస్తూంటాడు. చేతిలో హాకీబేట్ ఉంది.)

ముర :- (వస్తూనే) అదేం నాన్నా? వైకుంఠం అలా పారిపోతున్నాడేం?

పద్మ :- (ఆయాసంతో) భయపడి.

ముర :- ఎందుకు?

పద్మ :- శరభయ్య సంగతేదో చెప్పాడు. ఆ మాటలు వింటుంటే అనుకోని ఆవేశ మొచ్చింది. మరి ఏం చేసానో వైకుంఠాన్ని— హడలి పారిపోయాడు. (దగ్గు)

మురః- ఇలానే అనవసర విషయాల్లో జోక్యం చేసుకుని ఆరోగ్యం పాడుచేసుకుంటున్నారు.

పద్మః- (అయూసంతో) అనవసరమంటావేరా? అందర్నీ దుమ్మెత్తి పోస్తూంటే. కొంప వేలంవేయిస్తాడుట. నీకు నాకు చిప్ప చేతికిస్తాడుట. (దగ్గుతాడు)

మురః- అని వైకుంఠం చెప్పేడు. అంతేనా!

పద్మః- అవును.

మురః- ఆయనంటూండగా మీరు వినలేదుగా!

పద్మః- నేను వినాలా! విన్నవాళ్లు చెప్తే చాలదూ?

మురః- చెప్పేడు మాటలు నిజం అని ఎల్లా నమ్మగలం!

పద్మః- అబద్ధ మాడడానికి వాళ్లకేం అవుసరం?

మురః- అవసరమున్నా లేక పోయినా అబద్ధాలాడే వాళ్లు చాలమంది ఉన్నారు. ఉన్నవి లేనివి కల్పించి చెప్పి తగాదాలు పెంచుతారు. మనలో మనం తన్నుకు చస్తూంటే చూచి సంతోషిస్తారు.

పద్మః- (కోపంగా) చాలోయ్! చాలు. లోకాన్నంతా కాచి వడపోసినట్లు మాట్లాడుతున్నావు. ఎవరికి తెలియవోయ్ ఈ నీతులు— వెళ్లి ఇవన్నీ మీ మామతో చెప్పు. "మా జోలికొచ్చేవంటే మర్యాద దక్కదు. మావయ్యా" అని నోట్లో గడ్డిపెట్టు.

మురః- పరుల తప్పులెంచడం తేలికే! తన తప్పు తెలిసికో నడం కష్టం.

పద్మః- అయితే తప్పంతా నాదేనా ?

మురః- తప్పు ఎవరిదైనా కావలసిన వాళ్లం—కలహించుకో వడం మంచిదికాదు.

పద్మః- ఆ జ్ఞానం వాళ్లకి ఉండొద్దూ ?

మురః- మనకుంటే సరి.

పద్మః- ఏడిసినట్టేవుంది సలహా. తన్నడానికి తరుముకొస్తుంటే దాసోహం చెయ్యాలా! నాకు చేతకాదు. చేతులు జోడించి చిత్తంబాబు అనడం నా కలవాటు లేదు. నా జోలికి వస్తే నే నూరుకోను. పాతాళానికి త్రొక్కే పాతేస్తాను.

మురః- అలాగే చేయండి. కాని— విరోధే వియ్యంకు డవబో తున్నాడు మీకు—

పద్మః- ఏమిటీ! వాడు నా వియ్యంకు డౌతాడా? వాడి కూతుర్ని నువ్వు చేసుకుంటావా? వీల్లేదు. నే నొప్పు కోను.

మురః- ఒప్పుకోవలసింది నేను. పెళ్ళి చేసుకునేవాడిని నేను!

పద్మః- నిన్ను కన్నతండ్రిని నేను. పెంచి పెద్దచేసిన వాడిని నేను.

మురః- రాధనే పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకున్నాను.

పద్మ :- నిశ్చయించుకున్నావా ! నా పర్మిషను లేకుండానే!

ముర :- ఇది నా స్వవిషయం.

పద్మ :- (కోపంగా) స్వవిషయం !! ఏలా మారిపోయావురా ! మామ బాగా మారిపోసుంటాడు. అమ్మాయి ఎరచూపి కట్నం లేకుండానే కట్టేద్దామని చూస్తున్నాడు. ఒరేయ్! అందమైన పిల్ల అని ఆశపడుతున్నావేమొ ! ఇంతకన్న అప్సరసలాంటి పిల్లని పెళ్లిచేస్తాను. నువ్వేది కోరితే అది ఇచ్చే సంబంధం చూస్తాను. నా మాట విను. మన పరువు నిలబెట్టు.

ముర :- (ధీమాగా) పెళ్లికి ప్రధానం ప్రేమ - ప్రేమ లేని పెళ్లి పెళ్ళే కాదు. రాధ నేను కలసి మెలసి తిరిగేం— ఆడు కున్నాం— చదువుకున్నాం— ఏదో తెలియని బంధం మమ్మల్ని చిన్నప్పుడే ముడివేసింది. అదే బలమై శాశ్వత బంధంగా మారబోతూంది — అడ్డు పెట్టక ఆశీర్వదించండి.

పద్మ :- ఆలోచించుకునే మాట్లాడుతున్నావా ? తల్లీ, తండ్రి బ్రతికున్నారని గుర్తుందా ? మా మాట కాదంటే నీవే మాతావో తెలుసా ?

ముర :- అన్నీ తెలుసు. నా నిశ్చయ మంతే—

పద్మ :- తండ్రి కిష్టంలేని పెళ్లి చేసికొనే కొడుకుంటాడురా ?

ముర :- కొడుక్కిష్టంలేని పెళ్లి చేసే తండ్రీ ఉండడేమో ?

పద్మ :- తండ్రికి చెప్పవలసిన సమాధాన మిదేనా?

ముర :- కొడుక్కిచ్చే సలహా ఇదేనా ?

పద్మ :- నోరు ముయ్యి! పశువా! ఎదురు సమాధానం చెబుతావు! మామయ్య నెత్తిని కిరీటం పెడతా డనుకుంటున్నావు. ఇల్లరికం పెట్టుకొని ఇంటి చాకిరీ అంతా చేయిస్తాడు. కుక్క కన్న కనికష్టంగా చూస్తాడు. ఆ ఎంగిలి కూడు కాశపడతావా! చవట దద్దమ్మలా వాడి కొంప కాపలా కాస్తావా ? సిగ్గులేదూ? పౌరుషం లేదూ?

ముర:- మావయ్యని అర్థం చేసికోకుండా మాట్లాడుతున్నారు. పంతాలు పెంచుకుంటున్నారు.

పద్మ :- ఛీ! పశువా ! మళ్లీ అదే మాట! మెడ పట్టుకొని గెంటేస్తా,

(లోనుండి : భార్య : "ఏమండీ ! ఏమండీ ? ఏమిటండీ వాడితో సమంగా మీరూనూ" )

పద్మ :- నువ్వో కలుగచేసికోకు పో! పో ! (మురళీతో) ఆ పెళ్లి మానేస్తావా ! లేదా ?

ముర :- అది చాల కష్టం.

పద్మ :- కష్టమైతే పోరా ! ఇంట్లో ఉండొద్దు ! పో ! (గెంట బోతాడు)

ముర :- మీకా శ్రమవద్దు. నేనే పోతాను.

(లోనుండి "బాబు! నువ్వైనా నా మాట వినరా")

ముర :- బాధ పడకమ్మా! బ్రతికుంటే కలుసుకుంటాంలే!

(పోతుంటాడు)

పద్మ :- ఒరేయ్! నేను పట్టుదలమనిషిని సుమా!

ముర :- ఆ తండ్రికి కొడుకును నేను. (వెళ్ళిపోతాడు)

పద్మ :- (వెంబడించి) మురళీ! మురళీ! మాట వినకుండా పోతున్నావు. చెడిపోతావు సుమా! ఆగరా— ఆగు.

(గట్టిగా అరుస్తాడు. ఎక్కువగా దగ్గు ఆయాసం వస్తుంది. ఆయాసంతో అక్కడ చతికిలబడతాడు.)

(తెర)



[7]

# నాల్గవ రంగం

(శరభయ్య ఇంట్లో,- శ్రీశైలం కుర్చీలో కూర్చుని ఉంటాడు. వైకుంఠం గది గుమ్మం దగ్గఱ నిలచి లోనికి చూస్తూంటాడు.)

శ్రీశై :- ఏంచేస్తున్నారు— డాక్టర్లు?

వైకుం :- (అక్కడనుండే) చూస్తున్నారు— పేషెంటుని.

శ్రీశై :- ఇంకెంతసేపీచూడడం?

వైకుం :- మధ్య నీకేం తొందర?

శ్రీశై :- చూస్తూ, చూస్తూ కోతిపుండు బ్రహ్మరాక్షసి చేస్తున్నారు. గోటితో పోయేదానికి గొడ్డళ్లుపయోగిస్తున్నారు.

వైకుం :- (వచ్చి కూర్చుంటూ). ఆమాత్రం హడావిడి చెయ్యకపోతే ఫీజెవడిస్తాడు? రామానుజ!

శ్రీశై :- అందుకే డాక్టర్లంటే నాకు భయం— హాస్పటలు గుమ్మం ఎక్కాలంటే హడలు— ఎప్పుడూ స్వంత వైద్యమే. ఏ మందువాడాలో తెలిసికోడానికి పుస్తకాలున్నాయ్- బజారులో మందు లున్నాయి.

వైకుం :- డాబులుకొట్టకు మామా! అత్త నామధ్య హాస్పటలు కెందుకు పంపేవ్— మన మందులు అవతల పారెయ్యమందా?

శ్రీశై :- బాగుంది! అది ఆడవాళ్ల వ్యవహారం.

వైకుం :- ఇదీ అలాంటి వ్యవహారమే!

శ్రీశై :- పోనీ! ఈమాత్రం దానికి ఇద్దరు డాక్టర్లెందుకు చెప్పా.

వైకుం :- ఒక బుర్రకన్న రెండు బుర్రలు కలిస్తే బాగా పని చేస్తాయని.

శ్రీశై :- చాదస్తం— శుష్క డబ్బు దండుగ.

వైకుం :- నీదేం పోయింది. నీకెందుకా బెంగ? ఇద్దరుకాదు— ఇరవై డాక్టర్లను పిలిపిస్తాను.

శ్రీశై :- పిలిపించమను— నాకేం? అనవసరం డబ్బు ఖర్చు ఎందుకూ అన్నాను.

వైకుం :- ఆయన సొమ్ముకి నీ పెత్తన మేమిటి? అబ్బాయి నివ్వబోతున్నాం కదా అని అప్పుడే ఆరాలు తీయకు మావా! ఆవలిస్తే పేగులు లెక్కపెడతాను శరభయ్యా. మరచిపోకు— ఆ!

శ్రీశై :- నాకేం కావాలి? చిత్తం వచ్చినట్లు చేసుకోమను. ఉన్నా లేకపోయినా చివరికి ఆయన కూతురికేగా.

(లోనుండి కంగారుగా కొండయ్య వస్తాడు.)

కొండ :- ఏదీ? ఎక్కడా!— ఎక్కడా! కనిపించదే? (ఇల్లంతా వెతుకుతూంటాడు.)

వైకుం :- ఏమిటి? ఏమిటి?

కొండ :- తోలుసంచి బాబు— డాక్టరుగారి సంచి.

శ్రీశై :- ఏది ఎక్కడుంది? లేదే!

వైకుం :- బయట బండిలో వుందేమో! చూడు.

కొండ :- అవునవును. అక్కడేవుంటుంది. (పెరటిలోకి వెడతాడు.)

శ్రీశై :- నాకె కంగారు గొద్దు.

(కొండయ్య తిరిగి లోనికి వస్తూ)

కొండ :- ఉంది— బండిలో ఉంది బాబూ (లోనికి పోతాడు.)

[లోనుంచి "అబ్బబ్బ! చెప్పింది వినరా? నాకేమందులు వద్దు వెళ్ళండి"]

శ్రీశై :- మొత్తానికి డాక్టర్లు అమ్మాయిప్రాణం తీస్తున్నారు.

వైకుం :- ష్! ష్! మాట్లాడకు— వాళ్లు వినగలరు!

శ్రీశై :- వింటే నాకేం భయం. వాళ్లనే అడుగుతా ఏమిటీ తంతని?

వైకుం :- ఉండుమావా! పెళ్లి జరగాలి... శరభయ్య జుట్టు మనచేతిలో చిక్కాలి—అప్పుడు మాట్లాడాలి.

శ్రీశై :- లేనిపోని ఆశలు కల్పిస్తున్నావు— లిటిగేషనులో ఇరికిస్తున్నావు. కేసు నెగ్గుతామా?

వైకుం :- ఎవడికోసం? శరభయ్యప్రాణం అంతా అమ్మాయిలో వుంది. ఆ అమ్మాయి మన చేతిలో ఉంటుంది. అమ్మాయి నష్టం పెట్టుకొని ఒకాట ఆడించవచ్చు శరభయ్యని. అంతా ఉందిగా ప్లాను.

శ్రీశై :- అంతా కలసి అమ్మాయి మెడలు వంచుతున్నామా— అనిపిస్తోంది. బలవంతం పెళ్లి— ఇష్టం లేని కాపురం— ఎలా ఉంటుందో?

వైకుం :- మహారాజులా ఉంటుంది— డబ్బుతో వస్తుంది పిల్ల.

ఘాన్సంటే మీవాడిదే— అంతా అయ్యాక నన్ను మరచి పోకేం ? అనుకున్న ప్రకారం అయిదువందలూ......

శ్రీశై :- అయిదు వందలా ? మరి నా కీయాల్సిన నోటుబాకీ మాటో ?

వైకుం :- దానికి దీనికి ముడిపెట్టకు, దేని దారి దానిదే !

శ్రీశై :- అలా అంటే ఆ బాకీ ఎప్పుడు తీరుతుంది ?

వైకుం :- తీరక ఉండిపోతుందా ? ఇంతా చేస్తే రెండువందలు, దీనికే పారిపోతామా ? ఏమి లేకపోయినా కొంప ఉందిలే భయపడకు— ఆ హామీ చాలు నీకు.

శ్రీశై :- అదికాదు. నోటు కాలదోషం పడుతూంది.

వైకుం :- కావలిస్తే అయిదోపదో చెల్లు పెట్టించుకో, దానికేం? చూడు మావా ! కొంపంతా "రిపేరి" కొచ్చింది. కూలి పోవడానికి సిద్ధంగా ఉంది. ఏదో పెద్దమొత్తం చేతికొస్తే ఇల్లు రిపేరు చేయించుకోవచ్చు కదానని ఈ ఏడుపు. కొంప నిలబెట్టిన పుణ్యాం నీకు దక్కుతుంది.- ఏది వేలకు వేలతో వచ్చే కోడలిని చూపిస్తుంటే అఫ్ట్రాల అయిదు వందలు— ఇవ్వలేవ్ ?

శ్రీశై :- అన్నిటికీ "ఊ" అనిపిస్తున్నావ్! కాదనగలనా ?

వైకుం :- కాదంటే కథ అడ్డం తిరుగుతుంది. "వైకుంఠం" సంగతి తెలుసుగా.

శ్రీశై :- బాగుంది. నీ సంగతి ఎవరికి తెలియదూ ?

(లోనుండి— డాక్టరు నరహరి, పశుపతి చేతులు తుడుచుకుంటూ వస్తూంటారు. వెనుక శరభయ్య వస్తాడు.)

నర :- (వస్తూనే) తెలుసు; తెలుసు: ఇది నరాల బలహీనతే.

పశు :- అబ్బే, పైత్యావికారం.

వైకుం :- ఏమని తేల్చారు మహానుభావా?

నర :- తేలుస్తున్నాం (ఇద్దఱు కూర్చుంటారు)

శ్రీశై :- పశుపతిగారేమంటారు?

పశు :- మా సోదరులు చెప్పేరుగా.

శర :- అమ్మాయి ఆరోగ్యం బాగుపడుతుందనే ఆశతోనే దగ్గఱ ముహూర్తం పెట్టించాం. తీరా పరిస్థితి చూస్తుంటే పెళ్లి జరుగుతుందా అనే 'డౌటు' వస్తోంది. ఏ మందు లిచ్చినా సరే! ఎంత ఖర్చయినా సరే! అమ్మాయి ఆరోగ్యం బాగుచేయాలి! పరువు నిలబెట్టాలి. పెళ్ళి జరిపించాలి.

వైకుం :- దిగ్గజాల్లాంటి డాక్టర్లు ఇద్దఱు చేతిలో ఉండగా మనకేం 'డౌటు?' నరహరిగారి చెయ్యి మంచిది — పశుపతిగారి బుర్ర పెద్దది.

పశు :- నిస్సందేహంగా! శరభయ్యగారూ! 24 గంటల టైమిస్తే చాలు. అమ్మాయిని ఉక్కు-ముక్కలా చేస్తాను.

నర :- అందులో సగం. పన్నెండు గంటలు చాలు. వజ్రపు తునకలా చేస్తాను.

పశు :- అంతవరకు ఎందుకు? ఆరు గంటలైతే చాలు.

నర :- అదీ అక్కరలేదు! ఒక్క మోతాదుతోనే "క్యూర్"
చేస్తాను.

పశు :- మాటలు చెప్పగానే సరికాదు.

నర :- మందు లివ్వగానే సరిగాదు. పనిచేయాలి.

శర :- ఏమిటీ వాదోపవాదాలు. సరైన సలహా ఇవ్వండి.

నర :- అయిదు నిమిషాలు టైమివ్వండి. ఆలోచించి చెప్తాం.

పశు :- అంతే! అంతే!

శర :- సరే. మేమిక్కడుంటే మీ ఆలోచనల కడ్డురావచ్చు.
శ్రీశైలం! కాస్సేపు లోపల కూర్చుందామా?

శ్రీశై :- అలాగే! రావయ్యా! (వైకుంఠం, శ్రీశైలం లోనికి
పోతారు.)

శర :- (లోనికి నడుస్తూ) కొండయ్యా! రెండు కాఫీలు (లో
నుండి 'సరేనయ్యా') (పర్సులో డబ్బుతీసి) అడ్వాన్సుగా
ఇమ్మని మీ రడగలేదు. ఇవ్వడం నాకలవాటు లేదు
అయినా ఇదిగో మీ ఫీజు. ("వొద్దు, వొద్దు" అంటూనే
డాక్టర్లిద్దరూ ఫీజు పుచ్చుకుంటారు.)

[శరభయ్య లోనికి పోతూంటాడు. కొండయ్య కాఫీలు తెస్తాడు]

కొండ :- (పశుపతిని చూచి కాఫీ అందిస్తూ) అయ్యా!
డాక్టరుగారూ! తమరయాళ మందిచ్చారే......

పశు :- (కాఫీ త్రాగుతూ) ఎవరికి?

కొండ :- సినిమారోడ్డులో చిగుర్లిల్లండీ.

పశు :- ఓహో! ఆ కొత్తబాబా ఇల్లా? అవునవును. ఆ మనిషి నీకెలా తెలుసు.

కొండ :- మా మేనకోడలేనండి.

పశు :- అలాగా! చాల మంచిమనిషిలే! డబ్బుకి లెఖ్ఖ చెయ్యాడు. అందుకే ఆఖరి క్షణాల్లో ఆ కేసు టేకప్ చేసాను. ఇప్పుడు కులాసాగా ఉందిగా!

కొండ :- ఏం కులాసా! చచ్చిపోయాడండీ— ఆ కుర్రాడు.

పశు :- ఆ! పోయేడా! అసంభవం (నరహరి నవ్వుకుంటూ వుంటాడు)

కొండ :- అవునయ్యా! చచ్చేడు!

పశు :- అసంభవం. చావడానికి వీలులేదు.

కొండ :- చచ్చేడండీ—చచ్చేడు. నేనుకూడ ఎళ్లేను స్మశానానికి

నర :- (కలుగజేసుకొని) నీమోహం. ఆ చచ్చినవాడు మరెవ్వరి వేషంటో!

పశు :- అంతే! అంతే! మా పేషంట్లనలా చావనివ్వం. నిన్న కూడా చూసాను—మందిచ్చాను.

కొండ :- మందిచ్చి మీరెళ్లాకే చచ్చేడు.

పశు :- అదే అసంభవం. ఈ రోగం వచ్చినవాళ్లు ఇరవై రోజులైన బాధపడాలి- అధమం 14 రోజులైన తప్పదని వైద్యశాస్త్రం ఘోషిస్తోంది. ఈ కుర్రాడు జబ్బుపడి

ఇంకావారం రోజులైనా కాలేదు. అప్పుడే చచ్చేడంటే నేనెలా నమ్ముతాను ? శాస్త్రం ఎలా ఒప్పుతుంది ?

కొండ :- ఏమో ! చచ్చేడు ! చచ్చేడు ! తమ చేతి చలవే— అంటున్నారు.

పశు :- (కోపంగా) అవమానం. మాకు—మా వృత్తికే తీరని అవమానం !

నర :- కొండయ్యా ! బుద్ధిలేదు. పో. పనిచూసుకో.

కొండ :- అయ్యా ! (అంటూ పోతూ) ఉన్నమాటంటే ఉలుకెక్కువ.

నర :- డాక్టరుగారూ ! వాడితో మనకేమిటి ! రండి ! మన పని చూద్దాం. పాపం; ముందే డబ్బిచ్చాడా పెద్దమనిషి.

పశు :- పాపమేమిటి ? డబ్బు ముందే ఇచ్చాడంటే మన అవసరం ఉంది కనుకనే !

నర :- ఆమాత్రం నాకూ తెలుసు. కాని— ముందే డబ్బిచ్చే వాళ్లెవరు ఈ రోజుల్లో.

పశు :- లేకేం? నే నే కేసు టేకప్ చేసినా అంతో ఇంతో ముందే పుచ్చుకుంటూ—ఇస్తున్నారు కూడ.

నర :- అంత ఖచ్చితంగా ఉంటే ప్రాక్టీసు చేసినట్టే !

పశు :- కావలసినంత ప్రాక్టీసు. ఈ మూలనుంచి ఆ మూలకు— ఆ మూలనుంచి ఈ మూలకు, తిరగ లేక చస్తున్నాను. చూసేరుగా! సైకిలు రిక్షా "మెయిన్‌టెయిన్‌మెంట్"— చేస్తున్నా- కొత్తబండి, నాగపూర్‌నుండి తెప్పించా !

నర :- ఆ బాధ నాకూ ఉంది. ఊరంతా తిరగలేక ఉక్కిరి బిక్కిరి అవుతున్నా! అందుకే అమెరికా కంపెనీకి ఆర్డరిచ్చా— కారు— వస్తోంది రేపో మాపో.

పశు :- నేనూ కారు కొనేవాడినే. టాక్సులకు భయపడిమానేసా!

నర :- ఆ ఇబ్బంది నాకు లేదు— ఆఫీసర్లంతా మన పేషెంట్లే.

పశు :- వాళ్లేం ఇస్తారు? సొమ్ముకావాలంటే షావుకార్ల కేసులే పట్టాలి. చూసేరుగా! మన ప్రాక్టీసంతా మెయిను బజారే!

నర :- ఆశ్రయింపులతో ఎన్నాళ్లు ప్రాక్టీసు చేస్తాం. అసలు సత్తువ మనలోను, మన మందుల్లోను ఉండాలి.

పశు :- మనమందుల్లో ఆ 'మెరిట్' ఉంది. అనుపానం, పత్యం సరిగ్గా నడిపితే అమోఘంగా పనిచేస్తాయి.

నర :- అంతకన్న 'వండర్ ఫుల్'గా పని చేస్తాయి మా మందులు. "వన్ డోస్ విల్ డు ఫర్ వన్ మంత్" ("One dose will do for one month")

పశు :- మన మందుల విలువ ఎవరికి తెలియదు. పది రోజులు మందిచ్చినా మనకు ముట్టేది పావలో— అర్థో! అన్నీ పంచదార మాత్రలేగా!

నర :- మనవి మాత్రం— కషాయాలు, చూర్ణాలేగా. గచ్చాకు పుచ్చాకు నూరితే కావలసినంత మందు. "ఫ్రీ"గానే ఇవ్వొచ్చు.

పశు :- ఫ్రీగా నే నివ్వలేను. ఫీజు పుచ్చుకుంటాను. ఖచ్చితంగా పని చేస్తాను. చూ॰ నేరుగా! ఆ మధ్యను జ్ఞానానందంగారింట్లో 'సీరియస్'గా ఉందని కబురొచ్చింది. వెళ్లా! అటూ, ఇటూ! అన్నట్లున్నాడా పేషెంటు. అయినా 'ట్రై' చేస్తానన్నా! పాతిక రూపాయిలిమ్మన్నా. 'అమ్మో అంతసొమ్మే" అని ఆలోచనల్లో పడ్డారు. మన మేం చేస్తాం? పదినిమిషాలకల్లా ఇంటిల్లపాది ఘొల్లుమన్నారు.

[లోనుండి 'అమ్మా! అమ్మా!' అంటూ శరభయ్య, కొండయ్య శ్రీశైలం, వైకంఠం గొంతుకలు ఒక్కసారి వినిపిస్తాయి. నరహరి పశుపతి మాటలు ఆపుచేసి అటే చూస్తుంటారు. కొండయ్యను తరుముతూ రాధ వస్తుంది. వెనుక శరభయ్య, వైకుంఠం, శ్రీశైలం వారిస్తూ వస్తారు.]

రాధ :- ఆ మందు లసతల పారెయ్! ఊ! పారెయ్?

కొండ :- అమ్మా! అమ్మా! (డాక్టర్లు ఆశ్చర్యంగా చూస్తూ నిలబడతారు.)

శర :- తప్పమ్మా! తప్పు! రా (లోనికి తీసుకొనపోబోతాడు.)

రాధ :- అబ్బా! తల తిరిగిపోతుంది. అబ్బా! (శరభయ్య చేతిలో పడిపోతుంది. మెల్లిగా కొండయ్య, శరభయ్య రాధను లోనికి తీసుకొని వెడతారు.)

పశు :- సందేహం లేదు. పైత్యవికారమే!

నర :- అబ్బే! హిష్టీరియా!

వైకుం :- చూసేరా! అమ్మాయి స్థితి. ఏమిటాలోచించారు?

పశు :- అదే చేస్తున్నాం.

శేర :- ఏమిటి మీ అభిప్రాయం ?

నర :- చెప్పండి పశుపతిగారూ.

పశు :- మీరే చెప్పండి.

నర :- పెద్దలు మీరు చెప్పాలి.

పశు :- అనుభవం కలవాళ్లు మీరు చెప్పాలి.

నర :- కాదు మీరే.

పశు :- కాదు మీరే.

శేర :- (విసుగ్గా) ఎవరో ఒకరు చెప్పండి.

నర :- సరే ! ఇది నరాల బలహీనతే !

పశు :- అబ్బెబ్బే ! పైత్యావికారమే !

నర :- కాదు ! నరాల బలహీనతవల్ల వచ్చిన హిస్టీరియా.

పశు :- కాదు. వేడి, పైత్యం ఎక్కువవడంవల్ల వచ్చిన పైత్య వికారం.

నర :- 'అబ్సర్డ్ !' హిస్టీరియా. బలానికి టానిక్కులు, ఇంజెక్ష నులు ఇవ్వాలి.

పశు :- 'నాన్సెన్సు'! ఇంజెక్షనులు ఇస్తే మరీవేడి. రోజూ నిమ్మ కాయరసంతో మర్దనాచేసి తలంటు పోయాలి. ఆవు నెయ్యి, పంచదార అనుపానంతో ఆరువారలు మందివ్వాలి.

శేర :- తలోవిధంగా చెప్తున్నారు. ఇలా అయితే ఎలా ?

నర :- ఆలోచించుకోండి. ఆయన మందే కావాలో ! నా మందే కావాలో.

పశు :- పట్టాలు లేని డాక్టర్ల మందులు ప్రమాదం శరభయ్యగారూ !

నర :- కేటలాగులు చూచి ఇచ్చేవాళ్ల మందులు మరీ డేంజరండీ !

శర :- అయ్యో! ఇద్దరూ కలసి ఏదో సలహా ఇవ్వలేరూ !

పశు :- కుదరదండీ ! ఆయనదో థీరీ! మనదో థీరీ! రెండుకత్తులు ఒకవరలో ఇముడుతాయా ?

శ్రీశై :- బాగుంది. బలే తమాషాగా ఉందే ?

నర :- 'Yes' ఎందు కీగొడవ. ఎవరిమందు కావాలో చెప్పండి.

శర :- ఇద్దరూ కావాలి.

నర :- లాభం లేదు. ఎవ్వరు కావాలో తేల్చుకురండి. అప్పుడాలోచిద్దాం. (సీరియస్‌గా వెళ్లిపోతూంటాడు)

శర :- డాక్టరుగారూ!

నర :- చాలు. ఇద్దర్నీ పిలిపించి ఇలా అవమానం చేస్తారనుకోలేదు! వెళ్లండి. ఆయన మందే పుచ్చుకోండి. (వెళ్లిపోతాడు)

పశు :- అంతే! మాలో మాకు 'కాంపిటీషను' పెడతారా ? ఆయన్నే బ్రతిమాలండి ? నేను మందివ్వను. (పోతూంటాడు)

శర :- అయ్యా !

పశు :- ఇవ్వనండి ! నేను ముందిచ్చాను. (వెళ్లిపోతాడు)

(శరభయ్య ఏమీ మాట్లాడలేక అలా నిలబడిపోతాడు)

శ్రీశై :- బాగానే వుంది వ్యవహారం. పెళ్లి పేరు చెప్పి అంతా బాధపడుతున్నాం. రసాభాసంలో జరిగే పెళ్లి రాణించదు. చూస్తూచూస్తూ గోతిలో దిగలేం. ముహూర్తం మించిపోకుండా మరో మార్గం చూచుకోవడం మంచిదేమో ! వస్తా. (పోతూంటాడు)

శర :- శ్రీశైలం ! శ్రీశైలం !

శ్రీశై :- మళ్లీవస్తా !

వైకుం :- ఆగు మావా ! కొంచె మాలోచించు !

శ్రీశై :- ఆలోచిస్తా. (అంటూ వెళ్లిపోతాడు)

శర :- (కుప్పగా కూలిపోతాడు) ముందు నుయ్యి — వెనుక గొయ్యి. మాట దక్కేలా లేదు! వైకుంఠం. వెళ్లు నచ్చచెప్పు.

వైకుం :- ఆ విషయం నా కొదిలెయ్యి. అమ్మాయి సంగతి ఆలోచించు.

శర :- ఇంకేం చెయ్యడం. డబ్బు దండుగయింది. సలహా కూడ చెప్పకుండా జారిపోయేరు డాక్టర్లు.

వైకుం :- మరో పదిరూపాయలు పోతేపోయాయ్ ! మరో మంచి డాక్టరుని పిలిస్తే !

శర :- ఇంకేం వద్దు. డాక్టర్లూ వద్దు— మందులూ వద్దు. నే నీ బాధలు పడలేను. ప్రాణం విసిగిపోతుంది. పిల్లాలేదు. పెళ్లీ లేదు. ఉంటే ఉంటుంది— పోతే పోతూంది. ఎవరి ఖర్మ వారి దే. ఈ ఇంట్లో ఉండేకన్న — చస్తే మంచిది. (విసుగ్గా పోతూంటాడు.)

వైకుం :- మతి పోయిందా ? ఎక్కడి కెడతావు. ఈ సంసార మంతా ఎవరి కప్పగిస్తావు ?

శర :- బ్రహ్మదేవుడికి ! కొండయ్యా ! కొండయ్యా !

కొండ :- అయ్యా ! (వస్తాడు)

శర :- వచ్చేవా! ఇవిగో తాళాలు. అప్పగించుకో.

కొండ :- అదేందయ్యా.

శర :- తెల్లబోతావేం ? ఒక్క క్షణం యీ యింట్లో ఉండలేను. పెళ్లి జరగదు. మాట నెగ్గటంలేదు. మర్యాదపోతూంది. ఇంకెందుకు బ్రతకడం? బ్రతికి ఏం చెయ్యడం? పోతున్నా!

వైకుం :- నడు. నడు. గాబరాపడితే పనులు జరుగుతాయా !

కొండ :- అవునయ్యా ! అరి మాటినందయ్యా !

శర :- ఎందుకు నన్ను వెనక్కి లాగుతారు ? మనశ్శాంతికి మార్గం చూసుకోనివ్వరూ ?

వైకుం :- ఇదా మార్గం ? పెద్దవాడవు— మంచి చెడ్డలు తెలిసినవాడవు— కాస్త తమాయించుకోవాలి.

కొండ :- అప్పనయ్యా — అమ్మాయిగారికోసం దిగులెట్టుకోకం డయ్యా. నాకో డాక్టరు తెలుసు. 'మిషనాసుపత్రి'లో ఉన్నాడు దొర. మా గూడెంలో మతి పోయినోళ్లెందరినో బాగు చేసాడు.

వైకుం :- మరేం ? పిలుచుకురా చూద్దాం.

శర :- ఆశ చూపిస్తున్నారు. నాకేం నమ్మకంలేదు.

కొండ :- అట్టా అనకండయ్యా నాకు గురుంది.

శర :- మరయితే వెళ్లు. ఉన్నాడేమో చూసిరా. (కూర్చుంటాడు)

కొండ :- వెళ్లమంటారా !

వైకుం :- ఇంకా డవుటెందుకు. వెళ్లు.

కొండ :- మరి బాబుగార్ని .........

వైకుం:- నే నున్నాను.

కొండ :- ఓల్ రైటు. (కొండయ్య వెళ్ళిపోతాడు. వైకుంఠం కూర్చోబోతాడు)

శర :- వైకుంఠం! నువ్వు కూర్చుంటావేం ? శ్రీశైలాన్ని కలుసుకొని మాట్లాడవ్ ?

వైకుం :- వెడతా! నీవు ధీమాగా ఉండాలి.

శర :- అదేధీమా ! వెళ్లు.

వైకుం :- మరేమీ అధైర్యపడకు. శ్రీశైలం మన చేతిలో వాడే. కాదూ కూడదంటే కష్టం.........

శర :- పుచ్చుకోమను, మరో అయిదువందలు— అంతేనా.

వైకుం :- అంతే! కిక్కురమనకుండ ఒప్పుకుంటాడు. నీకెందుకు!
నూరు ఆరైనా, ఆరు నూరైనా ఈ పెళ్లి జరిపిస్తాం.

శర :- ఏంచేస్తావ్!

వైకుం :- చూస్తావుగా! వస్తా! రామానుజ! (వెళ్లిపోతాడు)

శర :- (పెళ్లాం ఫొటోకేసి చూసి) చూశావా నీ కూతురు! తను బాధపడుతోంది. నన్ను బాధిస్తోంది. పోనీ మురళికే చేద్దామనుకో! పద్మనాభం నన్ను లోకువచెయ్యడూ? నీచంగా చూడడూ? ఇంతబ్రతుకూ బ్రతికి ఇప్పుడు 'దాసోహం' చెయ్యగలనా! (పాజ్) వీల్లేదు— అలా జరగడానికి వీల్లేదు. పద్మనాభానికి తలొగ్గను. నా కిష్టమైనవాడే నా అల్లుడు కావాలి. (లోన గంటల శబ్దం) అదిగో గంట! జేగంట మ్రోగింది! జేగంట!

— తెర —



## ఐదవ రంగం

(శరభయ్య ఇల్లు. కుర్చీలో రాధ, "మిషన్" డాక్టరు వేషంలో మురళీ, కూర్చుని ఉంటారు. ఎదురుగా ఉన్న చిన్న బల్లమీద కొన్ని ఫలహారాలు, పళ్లూ ఉంటాయి.)

ముర :- (ఫలహారాన్ని నోటికందిస్తూ) ఊ! తినాలి.

రాధ :- ఊహుఁ! వద్దు

ముర :- మంచిదానవు కదూ! మాట వింటావు కదూ.

రాధ :- ఉహుఁ!

ముర :- బ్రతిమాలుతున్నా! కొంచెం తిను.

రాధ :- బాధించకు! నేను తినను.

ముర :- (కోపంగా) నా మాట వినవా!

రాధ :- వినను—వినను—వినను.

ముర :- అయితే వెళ్లిపోతా (లేస్తాడు)

రాధ :- మురళీ!

ముర :- ఉష్! డాక్టర్!

రాధ :- (గారంగా) డాక్టర్! గొప్పడాక్టరే! దొంగడాక్టర్!

ముర :- గట్టిగా మాట్లాడకు. గోడలకు చెవులుంటాయి. ఊ!
(తిరిగి టిఫిను అందిస్తాడు.)

రాధ :- (తప్పనిసరిగా తింటూ) ఎన్నాళ్లీ నాటకం?

ముర :- అయిపోతుంది— నీ పెళ్లితో.

రాధ :- (విసుగ్గా) అబ్బబ్బ! పెళ్లి! పెళ్లి! ఒకటే గొడవ. మాయపెళ్లి.

మురః- ఎగ్జాక్లీ! మాయపెళ్ళే,—మనం చేసుకోబోయే వదే!

రాధ :- కబుర్లతోనే కాలం గడుపుతున్నావు. నాటకమాడా లన్నావ్. చెప్పినట్టు చేసా. ఇప్పుడేమయింది ? నాన్న మనస్సు మారిందా ? పెళ్లి ఆగిందా ?

ముర :- ఆగితే నాటకమే లేదు ?

రాధ :- ఇంకీ నాటకాలు సాగవు. ముహూర్తం దగ్గర కొచ్చింది. మెడలు వంచి పుస్తి ముడేయిస్తాడు. కాదని ఎదిరించ లేను. ఔనని ఒప్పుకోలేను. పాడుజన్మ! పోతే శని విర గడై పోను. (విచారిస్తుంది.)

ముర :- మాట్లాడితే కన్నీళ్లు. ఆడవాళ్ల కిదో పెద్దజబ్బు. (కుర్చీ వెనుకకు వచ్చి రాధ ముఖం తనవైపు త్రిప్పుకొని, కళ్ల నీళ్లు తుడుస్తూ) డార్లింగ్ ! డేంజరులోంచి తప్పించడానికే ఈ డాక్టరు వచ్చేడు. అధైర్యపడ్డామంటే అమాంతంగా నాటకం 'క్లోజ్.' కొంచెం ధైర్యంగా...

రాధ :- ఇంకెంతకాలం ఈ ధైర్యం ?

ముర :- నన్ను చెప్పనిస్తావా ?

రాధ :- ఊఁ! చెప్పు! ఇంకేం చెయ్యాలో !

ముర :- ఏడుపుమాని కిలకిలా నవ్వుతూ ఉండాలి. ఇలా...
(మెడవద్ద కితకితలు పెడతాడు)

రాధ :- (నవ్వుతూ) హో ! బావా !

(గుమ్మంవద్దర : ముందు శరభయ్య- వెనుక కొండయ్యా వస్తా)

కొండ :- వచ్చాడు కదయ్యా !

శర :- ష్! మాట్లాడకు (ప్రక్కన నిలబడతారు)

కొండ :- (చటుక్కున తుమ్ముతాడు.)

ముర :- (గమనించి మిషనుడాక్టరు 'టోన్'తో) డాక్టరుమాట విను. కోపతాపాలు తగ్గించుకొని ఖుషీగా ఉండు ! చక్కగా ముస్తాబై చలాకీగా తిరుగు. "అమ్మాయిలో ఎంతమార్పు వచ్చింది !" అని నాన్న ఆశ్చర్యపోవాలి.

శర :- విన్నావా ! కొండయ్యా ! విన్నావా !

కొండ :- వింటున్నానయ్యా ! వింటున్నా.

ముర :- (కుర్చీ వెనుకనే నిలబడి అమ్మాయి ముఖానికి దగ్గరగా తన ముఖం చేర్చి, కళ్లు, ముక్కు, చెవులు, నాలుక పరిశీలిస్తూంటాడు)

శర :- చూడు, చూడు, కొండయ్యా ! అమ్మాయిని......

కొండ :- చూస్తున్నాడయ్యా కళ్లు, ముక్కు......

ముర :- ఏదీ నాలుక ?

రాధ :- (నాలుక చూపుతుంది.)

శర :- అదా ! తెలివైన డాక్టరే.

ముర :- ఆకలేస్తుందా ?

రాధ :- ఆ !

మురః- మరి అన్నం తినవేం ?

రాధః- ఇష్టంలేక.

మురః- ఎవరిమీద— నాన్నమీదా ?

రాధః- ప్రపంచం మీద.

మురః- ఓహో ! అర్థమయింది. (కూర్చుంటూ) నీకు గుండెల్లో భగభగా మండుతూన్నట్టుంది. బుర్రలో గబగబా వేయి రైళ్లు పరుగెడుతూంటాయి. మనస్సులో......

రాధః- ఏబాధ లేదు. ఎంతో హాయిగా ఉంది.

మురః- ఆ ! (ఆశ్చర్యంగా చూస్తాడు.)

రాధః- అనువు డాక్టర్ ! మీతో మాట్లాడుతుంటే బాధలన్నీ మరచిపోతున్నాను. మనస్సు తేలికగా ఉంది. ఎంతో 'హాపీ'గా ఉంది డాక్టర్ !

శరః- (సంతోషంగా) విన్నావా, కొండయ్యా !

కొండః- అయ్యా !

మురః- 'వెరీగుడ్'. మందు పనిచేసిందన్నమాట.

రాధః- డాక్టర్! ఇప్పుడే గాఢ నిద్రలోంచి లేస్తున్నట్లుగా ఉంది. చీకటిలోంచి వెలుతురులోకి వస్తూన్నట్లుంది. ఇన్నాళ్లు నేనేం చేసానో-ఏమేమి అన్నానో; ఏమీ గుర్తుకురావడం లేదు. ఏరి మానాన్న. "నాన్నా !" (అని కేకవేస్తుంది.)

శరః- అమ్మా ! (సంతోషంతో గబగబా ముందుకు వస్తాడు)

రాధ :- (ఎంతో గారాబంగా) ఎక్కడున్నావు నాన్నా !

కొండ :- ఇక్కడే ! మీ పక్కనే......

శర :- ష్ ! (రాధతో) ఎలా వుందమ్మా వంట్లో !

రాధ :- ఎంతో హాయిగా ఉంది ! చాలా సంతోషంగా ఉంది

శర :- బ్రతికించేవు తల్లి !

కొండ :- అంతా డాక్టరుగారి చేతిచలవ.

రాధ :- నాన్నా ! ఇన్నాళ్లూ నిన్ను ఎంతబాధపెట్టానో ! ఎంత కష్టపెట్టానో ! ఎంత చికాకు పెట్టానో !

శర :- ఏంచేస్తాం ? జబ్బుతీరే అంత !

రాధ :- ఇంకేం జబ్బులేదు. మామూలు మనిషినయాను. ఉండండి, మీ అందరికి కాఫీ తీసుకువస్తా......

శర :- ఎందుకమ్మా శ్రమ. !

రాధ :- ఫరవాలేదు. (చకచకా లోనికి పోతుంది. శరభయ్య అటే చూస్తుంటాడు.)

శర :- (ఆలోచిస్తూనే) కొండయ్యా ! కలగంటున్నామా ?...

కొండ :- లేదయ్యా ! నాటకం చూస్తున్నాం.

శర :- ఆఁ !

కొండ :- ...అనిపిస్తోందయ్యా.

ముర :- కలాకాదు, నాటకం కాదు. మన 'ట్రీట్‌మెంట్' మహిమ.

శర :- దొరగారూ! ఏం తెలివండి మీది? ఏం చేసారో! ఇట్టే బాగుచేసారే అమ్మాయిని.

ముర :- అదే మన 'స్పెషాలిటీ'. ఇంజక్షన్లు, ఆపరేషన్లు ఏమీ అక్కరలేదు. ఎలాంటి రోగాన్నైనా మాటలతోను, పాటలతోను ఇట్టే "క్యూర్" చెయ్యొచ్చు. అదే 'సైకో' ట్రీట్‌మెంట్.

శర :- ఆహాహా! ఎంత చక్కని పాయింటు! ఇంతమంది డాక్టర్లు చూచారా? ఒక్కరూ ఈ మాట చెప్పలేరా!

కొండ :- అసలు సంగతి ఆళ్లెవరకు తెలియందే!

ముర :- అమ్మాయి చూపులు—మాటలు—చేతలు—జాగ్రత్తగా చూసినాము. వెంటనే తెలిసికున్నాము, 'మైండ్ ఆర్డర్'లో లేదని. 'మైండ్' బాగులేదంటే మనస్సు బాగు లేదన్నమాట! అంటే, మనోవ్యాధి— కారణం? ఆశాభంగం!

కొండ :- అయివుండొచ్చు.

ముర :- వయస్సులోని పిల్లకు ఆశాభంగం ఎప్పుడు?

కొండ :- ఇష్టమైన మొగుడు దొరకనప్పుడు.

ముర :- 'కరెక్టు'! అందువల్ల ఇది 'లవ్ ఫైయిల్యూర్' కేసు అని నిర్ణయించాం. వేసేము మందు— 'స్వీట్ వర్డ్సు'.

శర :- ఎంత సుళువుగా కనిపెట్టారు— అసలు విషయం.

కొండ :- అందుకే దొరగారి పేరు మోత. బలే మోతగా ఉందయ్యా.

మురి :- అంతా 'లార్డు జీసస్' కృప. (ధ్యానిస్తాడు).

శర :- మళ్లీ తిరగబెట్టదు కదా ?

మురి :- ఏమీలేదు. కొంచెం 'ట్రిక్' చేయవాలి.

శర :- ఏమిటది ?

మురి :- అమ్మాయి మాటకు 'యస్' అనవాలి.

శర :- ఆ !

మురి :- తమాషాకి— నిజంకాదు. చెప్పినానుకదా ! మాటల తోనే మనస్సు బాగుచేయవాలే అని.

శర :- అబద్ధమాడలేను.

కొండ :- వుట్టిమాటలేగా "ఊ" అనండయ్యా !

మురి :- అనకపోతే "డేంజరు" తప్పదు పేషంటుకి. ఆలోచించు కోండి.

కొండ :- అనండయ్యా ఉట్టి నాటకమేగా.

(వైకుంఠం లోనికి వస్తూనే)

వైకుం :- నాటకమాడుతారా ? డొక్క చీల్చేస్తాను. ఏమను కున్నారో. (అందరూ ఆశ్చర్యపోతారు.)

శర :- వైకుంఠం ! ఏమిటది ?

వైకుం : అవునయ్యా ! మన దగ్గరేనా వీళ్ల నాటకాలు. కొం డయ్యా !

కొండ :- (రహస్యం బయట పడిందేమోనని భయపడుతూ) అయ్యా!

వై కుం :- వీరేనా? నీవు తీసుకొచ్చిన డాక్టరు?

కొండ :- అయ్యా!

శేర : అవును, వీరి దయవల్ల అమ్మాయిలో చాలా మార్పు వచ్చింది.

వై కుం :- అలాగా! (మురళిని సమీపిస్తు) మీరు డాక్టర్లు... అయివుండరు. కేవలం...... దేముళ్లే. తమది ఏ ఊరు అయితేనేం? ఏ పేరయితేనేం? ఏ మత మైతేనేం?

కొండ :- (టాపిక్ మార్చాలని) అయ్యా! అయ్యా! అమ్మాయిగారు (రాధ హుషారుగా వస్తుంది)

రాధ :- ఇదిగో కాఫీ!

శేర :- చూశావా? వైకుంఠం! అమ్మాయిని.

వై కుం :- చూస్తూన్నా (అటే చూస్తాడు)

రాధ :- కళ్లద్దాలో సరిగ్గా కనిపిస్తున్నానా?

వై కుం :- మారిపోయింది పూర్తిగా? ఇక నాటక మెలా ఆడతారో చూస్తాను, డాక్టరుగారూ......

శేర :- నాటక మేమిటి?

వై కుం :- అవునయ్యా! నాటకమాడుతున్నాడు. శ్రీశైలం, మనల్ని కాదని మరో సంబంధం 'శెటిల్' చేసుకున్నాడు.

కొండ :- (ధైర్యం తెచ్చుకుంటాడు) అదా? (మురళికి కూడ షాక్ తీరిపోతుంది.)

శర :- ఏమన్నాడు శ్రీశైలం?

వైకుం :- "బుద్ధి ఉందా! లేదా? జబ్బుపిల్ల నెలా చేసికో మంటావు?" అన్నాడు.

శర :- జబ్బుపిల్లా! ఒకసారి వచ్చి చూడమను. అమ్మాయి ముందు నిలబడ్డానికైనా అర్హత ఉందేమో వాడి కొడుక్కి... తెలుస్తుంది.

వైకుం :- పదిమందిలోను నిలదీసి అడుగుతా ఆ విషయం. బంగారు బొమ్మలాంటి పిల్లను జబ్బుపిల్ల అంటాడా? తాంబూలాలు పుచ్చుకొని, తీరా ముహూర్తం దగ్గరి కొచ్చాక తిరిగిపోతాడా! అదేదో తేల్చుకు వస్తా. (పోబోతాడు.)

రాధ :- ఆగండి! మీరు శ్రమపడొద్దు. నాకా పెళ్ళి వద్దు.

వైకుం :- ఆ! ఆ!

శర :- మళ్ళీ మొదటి కొచ్చావ్!

రాధ :- మొదటినుంచీ ఆమాటే అంటున్నాను.

శర :- రాధా! (కళ్లెఱ్ఱ చేస్తాడు)

మురళి :- Mr. శరభయ్యా— (ఏమో చెప్పబోతాడు)

శర :- క్షమించండి దొరగారూ! కలుగచేసుకోకండి. (రాధతో) రాధా! మనస్సు మార్చుకుంటావా! లేదా!

రాధ :- (మాట్లాడదు)

శర :- మాట్లాడవేం ?

రాధ :- ఏం మాట్లాడను నాన్నా! మనస్సు విప్పి చెప్పేను. గ్రహించలేకపోతున్నారు. మీమాటే మీదంటున్నారు.

శర !- రాధా !

రాధ :- (ఏడుస్తూ) అవును. నా మెడకు ఉరిత్రాడు వేయబోతున్నారు. యమలోకంలోకి పంపుతున్నారు. శాశ్వతంగా అంధకారంలోకి పడదోస్తున్నారు.

శర :- (ఉగ్రుడై) రాధా !

రాధ :- (అదే మూడ్‌లో 'కంటిన్యూ' చేస్తూ) మీకు హృదయం లేదా? కన్నకూతురు నన్న అభిమానం లేదా ? అమ్మే ఉంటే— నా కీ ఇనుప సంకెళ్లు వేయనిచ్చేదా ? మీ పంతాలకు నన్ను బలికానిచ్చేదా ? (ఏడుస్తుంది)

శర :- రాధా ! (బిగ్గరగా అరుస్తాడు)

వైకుం :- అది కాదయ్యా !

శర :- ఏదీ కాదు—నువ్వుండు (రాధతో) తేల్చుకో ! నాన్న కావాలో ? మురళి కావాలో? ఊఁ.

రాధ :- కోప్పడకు నాన్నా !

శర :- నాన్న ! ఇంకెందు కీ నాన్న! పో! ఆ వెధవదగ్గరకే పో!

(రాధను త్రోసివేస్తాడు. వైకుంఠం, కొండయ్య వారిస్తారు.)

మురి :- (క్రింద పడబోయే రాధనుపట్టుకొని) ఆగు మావయ్యా!

శర :- ఆ ! మావయ్య!

ముర :– అవును. నేను. మురళీని. (వేషం తీసివేస్తాడు)

శర :– మురళీ!— అరి దొంగా !

వైకుం :– కొండయ్యా! (వెనక్కు చూస్తాడు. కొండయ్య చల్లగా జారుకుంటాడు లోనికి)

శర :– వేషం వేస్తావా? కళ్లలో కారం జల్లడాని కొచ్చావా? రాస్కెల్ ! (కొట్టబోతాడు)

రాధ :– నాన్నా! (అడ్డుపడుతుంది)

శర :– తొక్కి పాతేస్తాను, తోడుదొంగ ల్నిద్దర్నీ ......

వైకుం :– (వెనక్కు లాగుతాడు) వొద్దు. చెయ్యి చేసుకోకు. చీటింగు కేసని చెప్పి జైల్లో పారేయిద్దాం. ఒక్కనిముష ముండు. పోలీసులను లాక్కొస్తా.

(వీధిలోనికి వెళ్ళబోతూండగా ఎదురుగా పద్మనాభం, శ్రీశైలం వస్తూంటారు.)

పద్మ :– (వస్తూనే) పారిపోతున్నావా? నడు— లోపలికి నడు.

వైకుం :– (బిక్క మొఖంవేసి) ఎవర్ని! నన్నే— నన్నే !

పద్మ :– నిన్నే! నడు! (రాధ మురళి మెల్లగా లోపలికిపోతారు)

వైకుం :– ఏం! ఏం! ఇలా వచ్చేవేం ?

శర :– (పద్మనాభంతో) ఆగు! నా గుమ్మంలో అడుగుపెట్టకు.

శ్రీశై :– శరభయ్యా! ఇంటి కొచ్చిన వాడిని ... ...

శర :– ఎవరు రమ్మన్నారు ?

పద్మ :– ఇద్దరి క్షేమం కోరి...

శర :- ఇప్పుడు కావలసొచ్చిందా క్షేమం? ఏం? చేసింది చాలలేదా?

శ్రీశై :- తొందరపడుతున్నావు శరభయ్యా!

శర :- నువ్వా మాట్లాడాలా? చెప్పుడు మాటలు విని దగా చేస్తావా? నలుగురిలో నన్ను "ఫూల్" చేస్తావా? పో, పో.

వైకుం :- రామానుజ (జారిపోబోతుండగా)

పద్మ :- (ఆపుచేసి) ఆగు వైకుంఠం! పారిపోకు.

వైకుం :- రామానుజ! మళ్లీ వస్తా.

పద్మ :- అడుగు కదిపేవా— ప్రాణం తీస్తాను. (పీక పట్టుకుంటూంది.)

వైకుం :- అమ్మోయ్! చచ్చేను. చచ్చేను.

శర :- వొదులు. ఏమిటా జబరదస్తీ! అమాయకుడిమీదా నీ ప్రతాపం.

పద్మ :- వీడా అమాయకుడు— కొంపలంటించే కొరివి.

శర :- కొరివి నువ్వు. కొడుకు నంటగట్టి కొంప దోచుకుందామని చూచిన మూర్ఖుడవు నువ్వు ...

పద్మ :- తండ్రీ కొడుకులను విడదీసిన ద్రోహివి నువ్వు ...

శర :- పెళ్లిళ్లు పడగొట్టే "ఫూల్"వి నువ్వు.

పద్మ :- ఆ!... 'ఫూల్' అంటావా!

శర :- ఒక్కసారి కాదు. పదిసార్లంటాను.

శ్రీశై :- శరభయ్యా! (వారింపబోతాడు)

శర :- దూరంగా ఉండు. (పద్మనాభంతో) సిగ్గులేని జన్మ.

పద్మ:- (కోపంగా) ఏయ్! అంతమాటంటావా! (కలబడబోతాడు)

శర :- ఛీ! అవతలకు పో! (తోసేస్తాడు)

శ్రీశై :- ఆగండి! ఆగండి! విషయం తెలిసికోకుండా ఏమిటి దెబ్బలాట? (విడదీస్తాడు)

పద్మ :- (శ్రీశైలంతో) చాల్లే! వొద్దంటే తీసికొచ్చావ్! చాల్లే అవమానం! పద పోదాం.

శర :- పొమ్మనే అంటూంట.

శ్రీశై :- వైకుంఠం! దీని కంతకీ కారణం నువ్వే!

వైకుం :- రామానుజ— నేనేం చేశాను ?

పద్మ :-నాతో ఏం చెప్పావ్? మాకు చిప్ప చేతికిస్తానన్నాడా శరభయ్య?

వైకుం :- (గుటకలు మింగుతూ) అదే! కొంప వేలం...

శర :- నాతో ఏం చెప్పేవు? పీటలమీద పెళ్లి పడగొడతా నన్నాడా పద్మనాభం.

పద్మ :- రామ! రామ! అలా అన్నానా నేను!

వైకుం :- (గుటకలు మింగుతూ) ఏమో! ఏమో!

శర :- ఏమో ఏమిటి! నిజం చెప్పు!

పద్మ :- చెప్పు. నే నెప్పుడన్నాను అలాగ?

వైకుం :- (కంగారుగా) జ్ఞాపకం లేదు.

శర :- ఆ! జ్ఞాపకం లేదూ! ఆరోజున— అమ్మాయికి నగలు, చీరలు తెచ్చిన రోజున— చెప్పలేదూ ?

వైకుం :- అ... న్నా... నా! (జ్ఞాపకం లేనట్లు చూస్తాడు.)

పద్మ :- చూశావా? ఇలానే లేనిపోని కబుర్లు చెప్పి 'లిటిగేషన్' పెంచాడు ? (వైకుంఠంతో) "పెళ్ళి చేయిస్తా! అయిదు వందలు ఇమ్మ"ని బేరంపెట్టావా శ్రీశైలంతో

శర :- ఆ! అంతపనే !

శ్రీశై :- అవును అడిగేడు.

వైకుం :- కమీషు నిమ్మన్నా నా? 'కొంప రిపేయిరు'కని అడిగితే.

శర :- దిట్టమైనవాడివే! చను విచ్చినందుకు ఇదా నీవు చేసేది?

పద్మ :- ఏం చేస్తే పాపముంది నిన్ను? . మెడలు విరిచేస్తే ...

వైకుం :-అమ్మోయి! చచ్చేను! అంతా ఏకమై ఇలా ఏడిపిస్తారా?

పద్మ :- ఏడిపించడం కాదు. ప్రాణాలు తీస్తాను. ఎవ డడ్డం వస్తాడో చూస్తాను...

శ్రీశై :- (ఆపుచేసి) జరిగిం దేదో జరిగింది. ఎవర్నేమంటే ఏం లాభం ఇప్పుడు? తప్పు మన అందరిదీ— ఐకమత్యం లేక పోవడం— అంతఃకలహాలు పెంచుకోవడం—మీ ఇద్దరి తప్పు. అదను చూచుకొని స్వార్థం కోసం 'లిటిగేషను' పెంచడం వైకుంఠం తప్పు. ఈ కమీషను ఏజంటును నమ్మి దురాశపడ్డం నా తప్పు. ఇప్పటికైనా ఆ అమ్మా యికు లిద్దరిని ముడిపెట్టడం న్యాయం.

వైకుం :- రామానుజ! అన్యాయం! అంతా ఒకటై పోయారు !
నే నెందు కిక్కడా ?

శ్రీశై :- వైకుంఠం! మా అందరిచేత బలే నాటకమాడించావు.
తెలివైనవాడవే! ఈ తెలివి కొంపలు కూల్చడానికి
కాక, నిలపడాని కుపయోగించు.

వైకుం :- చాల్లేవయ్యా! చెప్పేవు నీతులు.

పద్మ :- అలా బుద్ధిరాదు— కాలో చెయ్యో వంచేస్తే !

శ్రీశై :- ఇక వైకుంఠాన్ని వదిలెయ్యి.

పద్మ :- వైకుంఠం! నీ కిదే 'వార్నింగు'. మళ్లీ ఇలాంటి నాటకా
లాడావంటే నీ కాళ్లు విరగ్గొట్టేస్తా! పో పో!

వైకుం :- అనండి! అనండి! మీారనే రోజు— నేను పడే రోజు.
అయినా— అక్కరలేని గొడవలన్నీ నా కెందుకు.
రామానుజ!

పద్మ :- మళ్లీ అదేమాట. ఇంకిలాంటి వేషాలు వెయ్యనని
లెంపలు వేసుకో. (వైకుంఠం ఊరుకుంటాడు) ఊ !
లెంపలు వేసుకో!

వైకుం :- (తప్పనిసరిగా వేసుకుంటూ) రామానుజ!

శ్రీశై :- చచ్చిన పాము నెందుకు చంపుతారు ? పోనివ్వండి.

పద్మ :- బుద్ధి వచ్చిందా ?

వైకు :- ఆ !

పద్మ :- జాగ్రత్తగా మసులుకో ! పో!

వైకుం :- దేముడు లేడూ. పాపం పండదూ! కానివ్వండి! రామానుజ! (అవమానంతో ఒక్క దూకులో పోతాడు)

శర :- ఈ వైకుంఠం వెళ్ళిపోయినా ఇలాంటి వాళ్లెంతో మంది ఉన్నారు మనచుట్టూ. వాళ్లను తప్పించుకుని తిరగాలి మనం!

శ్రీశై :- నేర్చుకుందాంలే నీతులు...పెళ్ళిమాట ఏమంటారు!

పద్మ :- పిల్ల నిచ్చేవాడు ఆయనే చెప్పాలి?

శ్రీశై :- ఏం శరభయ్యా?

శర :- చేసుకునేవాడు— ఆయన్నే చెప్పమను.

శ్రీశై :- సరే! ఇక ఈ బెట్టుసరి కబుర్లు చాలించండి. గతాన్ని మర్చిపోండి. పెళ్ళి కొప్పుకోండి. (బావమరదులిద్దర్ని కలుపుతాడు)

(లోనుండి మురళీ, రాధ వస్తారు. మురళీ పద్మనాభానికి రాధ శరభయ్యకు నమస్కరిస్తూ)

ముర :-<br>రాధ :- } ఆశీర్వదించండి.

పద్మ :- ఇక్కడే ఉన్నావా? సాధించేవులే ... లే!

శర :- మాట నెగ్గించుకున్నావు లే అమ్మ, లే!

పద్మ :- (శ్రీశైలాన్ని వుద్దేశించి) నిజానికి మనందరం యీయనకి నమస్కరించాలి. వైకుంఠం మనల్ని విడదీయాలని చూసేడు. ఈయన మనల్ని కలిపేడు. తన తప్పు తెలిసికొని మన తప్పు సరిదిద్దేడు.

ముర :- అవును. కొండయ్యేడీ?

రాఘ :- కోప్పడతారని పారిపోయుంటాడు.

శర :- కోపమెందుకు ? కొండయ్యా... కొండయ్యా...

కొండ :- అయ్యా ! (భయంతో వస్తాడు)

శ్రీశై :- భయపడకు. చేసిన సహాయానికి అయ్యగారు బహుమానం ఇవ్వబోతున్నారు.

మురా :- అవునురా! డాక్టరును తీసికొచ్చినందుకు బహుమానం.

శర :- ఒరేయ్ ! ఇలారా ?

కొండ :- (భయంగా వస్తాడు)

శర :- నువ్వుచేసిన తప్పుకి ఏంచేయాలో తెలుసా నిన్ను ?

కొండ :- అయ్యా !

శర :- 'డిస్ మిస్' ! షో ! షో !

కొండ :- అయ్యా ! అయ్యా !

శర :- క్షమించేం — అయిదురూపాయిలు 'ఇంక్రిమెంటు' ఇచ్చాం—చాలా ?—

కొండ :- చాలకేంటయ్యా! కామందులు చల్లగావుంటే మాకదే చాలు— ఏడుకొండలాడా! ఎంకటరమణమూర్తీ ! అమ్మాయి పెళ్లి రైటుచేయించేవా— ఆ కడుపు నోకాయ కాయించేవంటే "ళ్— ళ్— ళ్" అంటూ

*"ఏడుకొండలసామి - ఎంకన్నబాబూ*
*ఏడుకగ పుట్టేవా మాయింట నీవూ ; జో ; జో ;"*
అంటూ ఆడుకుంటా.

(అందరూ నవ్వుతూంటారు)

-తెర-